# "అభినవ పోతన"తో యువభారతి అనుబంధం





# భోగినీ లాస్యం

'పోతన చరిత్రము'లోని

భోగినీ నృత్యఘట్టానికి రమణీయ వ్యాఖ్యానం

వ్యాఖ్యాత:

అభినవ పోతన

**వానమామలై వరదాచార్యులు**

శ్రీమాన్ వానమామలై వరదాచార్యుల శతజయంతి ఉత్సవాలను పురస్కరించుకొని పునర్ముద్రించి, 05.02.2012న విశాఖపట్నంలో జరిగిన వారి శతజయంతి ఉత్సవ సభలో ఆవిష్కరించి, 'యువభారతి' భక్తి పూర్వకంగా సమర్పించిన పూజాకుసుమం ఈ 'భోగినీ లాస్యం'


ప్రచురణ:



**యువభారతి**

ఆంధ్ర సారస్వత పరిషత్తు భవనములు

తిలక్‌రోడ్, హైదరాబాద్-1

**BHOGINI LĀSYAM**
Selections from **Pothana Charitramu** With a Commentary
by The Author, **Sri Vanamamalai Varadacharyulu**



**యువభారతి**

| | |
|---|---|
| ప్రచురణ | : 21 |
| ప్రథమ ముద్రణ | : 5,200 ప్రతులు, ఆనంద ఉగాది, 24 మార్చి 1974 |
| ద్వితీయ ముద్రణ | : 1000 ప్రతులు, 5 ఫిబ్రవరి 2012 |
| ముద్రణ సహకారం | : **శ్రీ తాళ్ళపల్లి మురళీధరగౌడు** |
| ముఖ చిత్రం కాన్సెప్ట్ | : **శ్రీ శీలా వీర్రాజు** |
| ముఖ చిత్ర రూపకల్పన | : **శ్రీ టి. మల్లేశ్** |
| డి.టి.పి | : **లిటరసీ హౌస్,** ఆంధ్రమహిళా సభ, హైదరాబాదు -7 ఫోన్: 040-2709 8406, 2709 6464 |
| ముద్రణ | : **కర్షక్ ఆర్ట్ ప్రింటర్స్,** 40, ఎ.పి.హెచ్. బి. విద్యానగర్, హైదరాబాద్-500 044, ఫోన్: 040-2761 8261 |
| ప్రతులకు | : **యువభారతి,** ఆంధ్ర సారస్వత పరిషత్ భవనములు, తిలక్‌రోడ్, హైదరాబాద్ -500 001 |
| | **విశాలాంధ్ర బుక్ హౌస్,** విజ్ఞాన భవన్, బ్యాంక్ స్ట్రీట్, హైదరాబాద్ - 500 001 |
| | **నవోదయ బుక్ హౌస్,** ఆర్య సమాజ్ మందిర్ ఎదురుగా, కాచిగూడ క్రాస్‌రోడ్స్, హైదరాబాద్ - 500 027 |
| వెల | : రూ॥ **50/-** |



# మా మాట

సమున్నత ప్రమాణాలుగల సాహిత్యం సమాజంలో సామరస్యాన్ని పెంచుతుందనే సదాశయంతో 'యువభారతి' తన కార్యక్రమాలను నిర్వహిస్తోంది. "చుట్టూరా ఆవరించుకుని వున్న చీకటిని తిట్టుకుంటూ కూర్చోవడంకంటె, ప్రయత్నించి ఎంత చిన్న దీపాన్నైనా వెలిగించడం మంచిది" అన్నవాక్యమే యువభారతికి ఊపిరి. గత 48 సంవత్సరాలుగా సాహిత్య సేవ చేస్తూ ఇప్పటి వరకు 178 పుస్తకాలను ప్రచురించింది. వాటిని తక్కువ వెలకే అందించే ప్రయత్నం చేసింది. వాటిలో కొన్ని పునర్ముద్రణలు కూడా పొందాయి.

ప్రస్తుతం ప్రతి నెల మొదటి ఆదివారం మధ్యాహ్నం 2 గంటల నుంచి 5 గంటల వరకు నగర కేంద్ర గ్రంథాలయంలో, చిక్కడపల్లిలో మా సమావేశ కర్త డా॥ వంగపల్లి విశ్వనాథంగారి ఆధ్వర్యంలో యువత కోసం వ్యక్తిత్వ వికాస కార్యక్రమాలను నిర్వహిస్తున్నది. మూడవ ఆదివారం మధ్యాహ్నం 2 గంటల నుంచి 5 గంటల వరకు శ్రీకృష్ణ దేవరాయాంధ్ర భాషా నిలయం; సుల్తాన్ బజార్‌లో వచోరీతిని, రచనా పాటవాన్ని, ఆలోచనా శక్తిని, సమీక్షా సామర్థ్యాన్ని పెంచేందుకు 'ప్రతిభ' కార్యక్రమాలను నిర్వహిస్తున్నది. ఇరివెంటి కృష్ణమూర్తి, ఆచార్య దివాకర్ల వేంకటావధాని గార్ల జయంతులను, ప్రముఖుల సాహితీ ప్రసంగాలను ఏర్పాటు చేస్తోంది.

కీ.శ. శ్రీమాన్ వానమామలై వరదాచార్యుల వారు యువభారతికి గురుతుల్యులు, గౌరవసభ్యులు, వక్తగా, ముఖ్య అతిథిగా గ్రంథావిష్కర్తగా, యువభారతి కార్యక్రమాలలో పాల్గొన్నారు. వారు రచించిన 'పోతన చరిత్రము' మహాకావ్యంలోని 'భోగినీలాస్య' ఘట్టాన్ని వారి వ్యాఖ్యానంతో 'సాహితీవాహిని' పరంపరలో మూడవ తరంగంగా తెలుగు పాఠకుల కందించింది యువభారతి. అది పలువురి ప్రశంసలనందుకుంది. భావం, నాదం, అభినయం త్రికరణాలుగా అవినాభావ సంబంధం కలవి. కవియే వ్యాఖ్యానకర్తగా వ్యవహరించడం ఉండదనే చెప్పవచ్చు. కాని ఆచార్యులవారికి సాహిత్యంతో బాటు సంగీత అభినయాలలో గల విశేష పాండిత్యాన్ని దృష్టిలో నుంచుకుని, ఈ గ్రంథానికి న్యాయం చేకూర్చాలనే సదుద్దేశంతో వారినే వ్యాఖ్యానం అందించవలసిందిగా కోరాం. వారు దయతో దానికి అంగీకరించడం యువభారతి మహద్భాగ్యంగా భావించింది. పూర్వం ప్రచురించిన 'భోగినీలాస్యం' ప్రతులన్నీ అమ్ముడయి, ప్రస్తుతం పాఠకులకు అందుబాటులో లేవు. దానిని పునర్ముద్రించమని పలువురు కోరుతూ వచ్చారు. శ్రీమాన్ వానమామలై వరదాచార్యులవారి శతజయంత్యుత్సవాల సందర్భంగా (2011-2012) ఈ గ్రంథాన్ని పునర్ముద్రించడం తన కర్తవ్యంగా భావించి, యువభారతి సాహితీ ప్రియులకు భక్తితో ఈ గ్రంథాన్ని సమర్పిస్తున్నది.

**మాడభూషి అనంతాచార్య**
అధ్యక్షుడు, యువభారతి

16.8.2011
హైదరాబాదు.



# వ్యాఖ్యాన రసానందలాస్యం

కొందరిపై మనకు ఎంత ప్రగాఢ విశ్వాసాలు వుంటాయంటే, కొన్ని పనులు వారే చేసినా, వారు చేసివుండరని నమ్ముతాం. అంతటి గాఢమైన ముద్ర వారు ఒక తీరుగా మనపై వేయడానికి హేతువైన దానికి భిన్నంగా, వారి వ్యవహారసరళిని మనం ఊహించలేం! మనకు వారిపైగల ప్రగాఢ భక్తి విశ్వాసాలే మనలనలా భావన చేయిస్తాయి.

ఆంధ్రమహాభాగవతాన్ని తెలుగు జాతికి అద్భుత ఉపాయనంగా అందించిన మహాకవి బమ్మెర పోతన.

ఒనరన్ నన్నయ తిక్కనాది కవులీ యుర్వింబురాణావళుల్<br>
తెనుగున్ సేయుచు మత్పురాకృత శుభాధిక్యంబు తానెట్టిదో<br>
తెనుగుంజేయరు మున్ను భాగవతమున్ దీనిం దెనింగించి నా<br>
జననంబున్ సఫలంబు చేసెద బునర్జన్మంబు లేకుండగన్

అని భాగవతానువాదం తన పాలిటి సుకృతమనీ, పునర్జన్మలేకుండా తన జన్మని సఫలం చేసుకుంటాననీ అన్న పోతన తెలుగు వారందరికీ పురాకృత భాగ్యవిశేషంగానే ఆ రచన నందించాడు. పైగా దానిని శ్రీరామునికే అంకితం చేశాడు. జగద్ధితంబుగా చెప్పిన రచనే కానీ పురాలు, వాహనాలు, సొమ్ములు పుచ్చుకుని ఏ రాజుకో అంకితం ఇవ్వననీ ఆ సరస్వతీ దేవి కంటనీర్వెట్టనవసరం లేకుండా తన రచనను కూళలకిచ్చి యప్పుడుపు కూడు భుజించననీ, హాలికుడిగానే హాయిగా జీవించగలననీ పేర్కొన్న మహనీయుడైన పోతన మహాకవి భాగవతం కాక అంతకు ముందు వీరభద్ర విజయం, భోగినీదండకం రచించాడని తెలుస్తోంది. 'నారాయణశతకం' కూడా ఆయన రచన అనే వారున్నారు.

'వీరభద్ర విజయం' విషయంలో కూడా అభ్యంతరం లేదేమోగానీ భక్తాగ్రేసరుడయిన పోతన 'భోగినీదండకం' రచించాడంటే చాలా మందికి ఒప్పుకో బుద్ధిగాదు. రాజతిరస్కారం చేసిన సాహసోపేత కవి రాజవేశ్యపై కవిత్వం చెబుతాడని ఎలా ఊహిస్తామంటారు.

భాగవతం రాయడానికి ముందు రాచకొండ సామ్రాజ్యాన్నేలిన పద్మనాయకరాజయిన సర్వజ్ఞ సింగభూపాలుడి ఆస్థానంలో పోతన వుండేవాడంటారు. భాగవతాన్ని సింగభూపాలుడు తనకి అంకితం ఇమ్మన్నాడనీ పోతన దానికి నిరాకరించాడనీ కథనం వుంది. అయితే రాజాస్థానంలో వున్నప్పుడే పోతన 'భోగినీదండకం' రాసాడని ప్రతీతి.

పోతన భాగవతరచనా భక్తాగ్రగణ్యత్వం ఆయన జీవనక్రమ పరిణామం కావచ్చు.

వయసులో వున్నప్పుడు ఆ వయసుకు తగిన మానసిక స్వభావం వుండడం దోషమేమీ కాదు. "కామిగాక మోక్షగామి కాడు" అన్న భావన అంగీకారయోగ్యమే కానీ మానవ సహజస్వభావ స్థితి ప్రోద్భలకమేగానీ వేరు కాదు. ఈ దృష్టితో పరికించినపుడు భోగినీదండకం పోతన రచన కావడం విమర్శనీయమేమీ కాదు.

తెలుగు వాఙ్మయంలో తొలి దండక రచనగా కూడా విమర్శకులు పోతన 'భోగినీదండకం'ను పేర్కొంటూ వున్నారు. పైగా ఆకాలంలో రాజవేశ్యలు కూడా కేవల సౌందర్య విలసితులు కావడం మాత్రమే కాక ప్రతిభాపాటవాలు గల వారిగా రాణిస్తూండేవారు. ఆమెలోని నాట్య కళా వైభవానికి ముగ్ధుడై పోతన ఆమెను ఆమె కథనాన్ని రచించి వుండవచ్చు.

"ఉల్ల సత్ఫుల్ల మందార రాజన్మరందంబు నందంబునం

గ్రోలు మత్తాళి దుత్తూరముం గ్రోలునే..."

వంటి భోగినీదండకంలో అభివ్యక్తమైన భావాలే భాగవత రచనాకాలం నాటికి మందారమకరంద మాధుర్య విలసిత పద్యాలుగా పరిణమించివుంటాయనుకోవచ్చు. భోగినీదండకంలోని భావాలుగానీ, అనుప్రాసాది అలంకారాలుగానీ భోగినీ దండకం పోతనరచనే అనేలా వున్నాయి.

'పోతన చరిత్రము' రచించిన శ్రీ వానమామలై వరదాచార్యులుగారు 'అభినవపోతన' అనిపించుకున్న విద్వన్మణులు. పద్య, గేయ, నాటక, శతక, వ్యాస, వచన కథా కావ్య, అనువాద రచనా ప్రక్రియలెన్నింటనో నిష్ణాతులైన ప్రతిభామూర్తులు. ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ విద్యాశాఖలో ఉపాధ్యాయులుగా పనిచేసి అనంతరం ఆరు సంవత్సరాలపాటు రాష్ట్ర విధాన మండలి సభ్యులుగా కూడా నియమితులైనవారు. పోతన చరిత్రము మహాకావ్యం వెలువరించిన వరదాచార్యులు వారు అందులో పోతన భోగినీ దండకం రాసినట్లు విశ్వసించినందువల్లనే భోగినీలాస్యం గురించి డెబ్భైఏడు పద్యాలలో రసోచితంగా వివరించి రాసారు.

1974లో యువభారతి వారు పోతనచరిత్రములోని భోగినీలాస్యం, 'సాహితీవాహిని'లో మూడవతరంగంగా వెలువరించ సంకల్పించి, ఆ పద్యాలను విశేషార్థ వివరణంతో ప్రచురించడానికి వరదాచార్యులవారినే వ్యాఖ్యానం రాసి ఇవ్వవలసిందని కోరగా మూల రచయితనైన తానే, వ్యాఖ్యానం రాయడం ఏమిటని భావించక ఎంతో ఆదరంతో అంగీకరించారు. 'భోగినీలాస్యం' అలా వెలుగులోకి వచ్చింది. వానమామలై వరదాచార్యులవారి శతజయంతి సంవత్సర ప్రారంభంలో దీనిని యువభారతే తిరిగి పునర్ముద్రించడం భాగ్య విశేషంగా భావిస్తున్నాం.

జనం భావించినట్లుగా భోగిని రాజాస్థాన వేశ్య అనీ, రాచకొండ ప్రభువైన సర్వజ్ఞ సింగ భూపాలుని ఉంపుడుకత్తెయనీ భావించడం తగదంటారు వరదాచార్యులవారు. జన

బాహుళ్యంలో ప్రచారంలో వున్న వైనం సింగభూపాలుని వేశ్యపేరు భోగిని. ఆమె రాజుని వలచి విరహార్త అయింది. ఆమె తల్లి తగదని వారించినా వినక ప్రభువును కలిసి అతని అనుగ్రహంబడసింది. అతని ప్రియురాలిగా హృదయ సామ్రాజ్యాన్ని ఏలింది. పోతన 'భోగినీదండకం'లోని వృత్తాంతం అదే. పోతనవంటి మహాకవి భోగిని పై రచన చేసాడంటే భాగవతభక్తులెవ్వరికీ అంత సులభంగా విశ్వాసమేర్పడదు.

విద్వన్మణులు, పోతనహృదయం మూలమట్టుగా గ్రహించిన పండిత కవి శ్రీ వానమామలై వరదాచార్యులువారు భోగినీ లాస్యం రచిస్తూ ఆమె వేశ్య కాదనీ రాజుగారి భార్యయే అని అంటారు. పట్టాభిషిక్తురాలు కాని రాజు భార్యను 'భోగిని' అనడం నాడు రూఢిగా వున్నదనీ అందువల్ల భోగినిని సింగభూపుని పట్టంపు రాణిగాని భార్యగా భావించడం న్యాయమనీ అప్పుడే భక్తి జ్ఞాన వైరాగ్యరాశియైన పోతనను మహాకవి భోగిని గురించి దండకం రాసాడు అనడం యుక్తియుక్తమేననీ పేర్కొన్నారు. ధీరోదాత్తుడైన సింగ భూపాలుడు ఆమెను పాణిగ్రహణం చేసుకున్నాడనడం సమంజసం అన్నారు.

'భోగిని' గొప్ప నాట్య కళా విశారద. శృంగార రసాభినయాదుల్లో నాట్యంలో స్త్రీ లాస్యం మనోజ్ఞంగానూ చిత్తాకర్షకంగానూ భాసిస్తుంది. సౌందర్య సౌకుమార్య సంశోభితమైన భోగిని నాట్యం పోతన దండకం రాసేంత ప్రేరణాత్మకం ఎలా అయ్యిందో వరదాచార్యులుగారి భోగినీ లాస్యం పద్యాలలో అభివ్యక్తీకరించిన భోగిని నాట్య వైభవం తెల్పుతుంది. భోగినీ లాస్యంకు స్వయంగా తన పోతన చరిత్రలో హృద్యమైన పద్యాలలో ఆకృతినిచ్చిన కృతికర్త వరదాచార్యులవారే వ్యాఖ్యానం సంతరించడం కవి హృదయాన్ని కవి ముఖతః తెలుపుతుండడమేగాక ఒక అద్బుత నాట్యకళా వైభవాన్ని వివరణాత్మకంగా ఆవిష్కరించినట్లయింది.

ఒడుపు నొదుగుఁగల్గి కడుకోమలత నొప్పి
యభినయించునట్టి యాలతాంగి
యొకొక యవయవమ్మె యొయ్యారములనిధి
కవన జలధి శిల్పకళల కవధి

అంటారు ఆచార్యులవారు. కృష్ణుని పట్ల రాధ ప్రేమానురాగాలు ఎలాంటివో సింగ భూపాలునిపట్ల భోగిని భావన అలాంటిది. యమున నీటికై వచ్చితిననుట యొక మిష. నీ రాగామృతంతో యీ ఘటము (దేహము) నిండిపోయింది. దీన్ని మోయలేను. నీవే భర్తవై యుద్ధరింపవలెను అని గోపిక రాధ కృష్ణుని భావన చేసినట్లే, నేను నాట్యం అనే మిషతో వచ్చానుగానీ నీ అనురాగామృతం ఆహరించుటే ప్రధానోద్దేశ్యం. నా విరహాంధకారం యమునవలె ఉరుకులాడుతోంది. దీన్ని తరింపచేసే నావవు నీవే అని భోగిని సింగ భూపాలునికి విన్నవిస్తుంది. హరి అనే పేరు సింగమునకు చెల్లుతుంది కనుక నీవు నన్ను పరిగ్రహించు ప్రభూ అంటుందామె.

'భోగినీలాస్యం' పోతన చరిత్రంలోని ఒక మధురఘట్టం. నాట్యకళా వైభవాన్ని, శృంగార

రస మధురిమనీ, ప్రణయభక్తి భావనారాధనాన్నీ వివరించే రచనం. సవ్యాఖ్యానంగా ఆ ఘట్టాన్ని వరదాచార్యులవారు యువభారతికి ఉపాయనంగా అందించిన గ్రంథాన్ని ఈ తరం పాఠకులకు పునర్ముద్రణగా అందించగలుగుతున్నందుకు, అదీ వారి శతజయంతి ప్రారంభ సందర్భం కావడం మాకు ఆనందంగా వుంది. రసజ్ఞ పాఠకులు దీనిని సమాదరిస్తారని ఆకాంక్షిస్తున్నాం.

కృష్ణాష్టమి
21.8.2011

సదా మీ
**సుధామ**
ప్రధాన సంపాదకులు
యువభారతి ప్రచురణలు



# ప్రేరణ

*(తొలి ముద్రణ ప్రతినుంచి)*

**మా**ట ద్వారా మనసులోని భావాలు ఆవిష్కృత మౌతాయి. మనసు నాకట్టుకునేలా చెప్పబడిన మాట- పదికాలాలపాటు నాలుకలపై లాస్యమాడుతుంది. చక్కని సాహిత్యానికి ఈ లక్షణం పుష్కలంగా ఉంటుంది.

చెవుల కానందాన్నందించే సంగీతమూ నేత్రానందాన్ని కలిగించే నృత్యమూ- సాహిత్యం ఆధారంగా ప్రచారాన్ని పొందగలుగుతాయి. ఆ లలితకళల గురించి ఏ కొంతైనా పరిచయం ఉండటం- వ్యక్తి పరిపూర్ణ మానసిక వికాసానికి దోహదం చేస్తుందని అంటారు. అందుకే- భోగినీ నృత్య ఘట్టాన్ని, రచయితచే విశేషవిషయాల ప్రస్తావనతో వ్యాఖ్యానంగా, తెలుగు పాఠక లోకానికి అందిస్తున్నాం. పోతన చరిత్రం అనే మహాకావ్యాన్ని మన కందించిన శ్రీ మాన్ వానమామలై వరదాచార్యులుగారి వ్యాఖ్యానంతో-భోగినీలాస్యం అనే పుస్తకాన్ని సాహితీవాహిని పరంపరలో మూడవ తరంగంగా అందిస్తున్నాం. వారి కావ్యగానం విన్నప్పుడు, కలిగే ఆనందం వర్ణనాతీతమైనది. శబ్దాన్ని (నాదాన్ని) బంధించి అందించగలగడం మా పని కాదు. అందుకే అక్షరాన్ని అందించేందుకు పూనుకున్నాం.

"సొంత లాభం కొంతమానుకు-పొరుగువాడికి తోడుపడవోయ్"

మరీ నిస్వార్థంగా ఉండగలగడం సంభవమేనేమో, కాని-అసలుకు ముప్పురాకుండా మనగల్గడం ఎంతైనా అవసరం. అందుకనే నేమో- సొంత లాభం కొంతమాను కొమ్మని సెలవిచ్చారు మహాకవి గురజాడ. యువభారతి నిర్వహిస్తున్న కార్యక్రమాలలో-ఈ సొంతలాభం కొంతమానుకొని, సమాజ పరమైన లాభానికై ప్రయత్నిస్తున్న విషయం- సహృదయులకు విదితమే. వట్టి మాటలు కట్టిపెట్టి గట్టిమేల్ తలపెట్టాలని- అనే భావం సూచించే ధ్యేయం ప్రేరణగా యువభారతి నడుస్తోంది. సమాజంలో సామరస్యం పెంపొందాలని సమగ్రమైన అవగాహన కలగాలనీ-సమ్యక్ దృష్టి ఏర్పాడాలనీ-కనీస విలువలపై నమ్మిక, మానవతామర్యాదలపై విశ్వాసం పెరగాలనీ-ప్రజాస్వామ్యం విలువలు పదికాలాలపాటు పదిలంగా కాపాడబడాలనీ- అందుకని, అచ్చుపోసిన అక్షరాల ద్వారా ఆలోచనలను వెదజల్లవచ్చుననీ-ఉత్తమ సాహిత్యం చౌకగా అందించడం ఇందుకు అవసరమనీ- యువభారతి కృషి చేస్తున్నది.

'సాహితీవాహిని'లో ప్రతి తరంగాన్నీ ఒక రూపాయికే అందించాలని ఆరంభించినా- రెండవ తరంగంనాటికే ధరలు రెండు రెట్లకు పైగా పెరిగినందువల్ల అతిక్లిష్ట పరిస్థితుల్లోనే సాధ్యమౌతోంది. రానున్న ప్రచురణలను ఈ ధరలకు అందించ లేమేమోనన్న అనుమానం

బలంగావుంది. "లావొక్కింతయు లేదు, ధైర్యము విలోలంబయ్యె". పుస్తకాలను ముద్రించడం కష్టం. అచ్చుపోసిన వాటిని అమ్ముకోవడం మరీ కష్టం. ఎంత ఆలస్యం! ఎంత కమీషన్!! ఈ విషవలయం నుండి బయట పడాలంటే పుస్తకాలను కొని చదివేవారి సంఖ్య పెరగాలి. పుస్తకాలు అధిక సంఖ్యలో అమ్ముడుపోవాలి. అప్పుడే-తక్కువలాభంతో సర్దుబాటు చేసుకొని, ప్రచురణ కార్యక్రమాన్ని కొనసాగించే అవకాశం ఉంటుంది. ఈ మేరకు సహృదయుల మనస్ఫూర్తి సహాయసహకారాలను అర్థిస్తున్నాం- వీలైనంత ఎక్కువ మందికి వీలైనంత తక్కువధరకు ఉత్తమ సాహిత్యాన్ని అందించ బూనుకుంటున్నందు వలన-ప్రచారం అవసరమనీ- అధిక సంఖ్యలో ఇలాంటి ప్రచురణలు త్వరత్వరగా రావాలంటే- సహృదయులందరూ, ఇది తమ పనిగా పూనుకొని సహకరించాలనీ విన్నవిస్తున్నాం.

"మీ ద్వారా మరొక్కరికి మరొక్క ప్రతిని అందేలా చూడండి" అని అర్థిస్తున్నాం. ఈ మాత్రం సాయంచేయడం-మీకు పెద్ద భారం కాదని ఆశిస్తున్నాం. ఈ భోగినీలాస్యం మీకు నచ్చుతుందని భావిస్తున్నాం. ఇలాంటి ప్రయత్నాలు నిరవధికంగా కొనసాగాలనీ మీ అభిమతమైతే-మీరు మనస్ఫూర్తిగా సహకరించండని విన్నవిస్తున్నాం. ప్రత్యక్షంగా, ఆర్థికంగా సాయపడవచ్చు. అంతకన్నా ముఖ్యం, మీ స్నేహితులకు యువభారతి ప్రచురణలను పరిచయంచేసి వారిచేత కొనిపింపచేయడం వారిని సాహితీమిత్రులుగా, భారతీ మిత్రులుగా, భారతీభూషణులుగా చేర్పించడం-ఇలా మీ సహాయసహకారాలను అందించవచ్చు.

ఈ 'ఆనంద ఉగాది'నాడు, భోగినీలాస్యంతో పాటుగా, సాహితీ వాహినిలో రెండవ తరంగం, ఆరుద్రగారి రసార్ద్రమైన వ్యాఖ్యానంతో వేమన్న వేదం వెలువడుతోంది. ఈ రెండు పుస్తకాలూ విశేషమైన ప్రజాదరణ పొందగలవని నమ్ముతున్నాం. మీ సహకారాన్ని అర్థిస్తున్నాం. సాహితీ వాహిని పరంపరలో, కొత్త పుస్తకాలతో మీ ముందుకు రావాలనీ, వీలున్నంత త్వరగా రాగలవనీ, వీలైతే రూపాయికే అందించేందుకు యత్నించాలనీ-మీ ఆశలకు "ఆనంద" ఉగాది ఆశీర్వాదం పలుకగలదనీ ఆశిస్తున్నాం. మీ సహకారాన్ని అభిలషిస్తూ-

24-3-1974

ఆనంద ఉగాది

**వంగపల్లి విశ్వనాథం**

సమావేశకర్త



# మా గురించి

(తొలిముద్రణ ప్రతినుంచి)

**మ**నిషిలో అంతర్లీనంగా, నిక్షిప్తంగా ఉన్న ప్రతిభా పరిమళాలు పరివ్యాప్తం కాగల్గినప్పుడే అతని సృజనాత్మక శక్తికి సార్థక్యం చేకూరుతుంది. సమాజంలో సౌందర్యం, సౌజన్యం, పెంపొందడానికి అనువైన వాతావరణం ఏర్పడుతుంది. పరస్పరావగాహనం కలుగుతుంది. నిర్మాణాత్మక దృక్పథాలకు ప్రాచుర్యం లభిస్తుంది. సమైక్య భావాలు కుదురుకుంటాయి.

ఆలోచనా స్వేచ్ఛ జాతిప్రగతికి, దేశపురోగతికి దోహదం కలిగించే విధంగానూ, కళాసృష్టికి ప్రతిభావ్యుత్పత్తులు ప్రాతిపదికలు కాగలిగే విధంగానూ, వ్యక్తిత్వ నిర్మాణం సాంఘికాభ్యుదయంతో పెనవేసుకొనిపోయే విధంగానూ, సాహిత్య సాంస్కృతిక కార్యకలాపాలను సజీవజాతి నిర్వహించుకుంటుంది. ప్రజాస్వామ్య వ్యవస్థకు నారుపోసేవి ప్రతిభా సౌమనస్యాలే.

యువభారతి కడచిన పదేళ్ళుగా సమాజంలో సామరస్యాన్ని పెంపొందించేందుకు సాహిత్యంకంటె ఇతరమైన సాత్త్విక సాధనం లేదనే విశ్వాసంతో ఇతోధిక కార్యక్రమాలను రూపొందించి కృషిచేస్తున్నది.

పక్షానికి ఒకమారు శ్రీకృష్ణదేవరాయ ఆంధ్రభాషానిలయంలో సాహిత్య సమావేశాలను ఏర్పరచి, యువభారతి తన సభ్యులకు సక్రమంగా ఆలోచించే పద్ధతిని అందంగా శక్తిమంతంగా, అర్థవంతంగా మాట్లాడగలిగే సామర్థ్యాన్నీ, నైపుణ్యాన్నీ ఎదుటివా అభిప్రాయాలను సహనంతో వినే సహృదయాన్నీ, ఆలోచన రేకెత్తించి, వివేకాన్ని ఉద్దీపిం చేయగలిగే అధ్యయనశీలతనూ అలవరచేందుకు వివిధ దృక్కోణాలతో రూపొందిం కార్యక్రమాలను నిర్వహిస్తున్నది.

సాధ్యమైనంత తక్కువ వెలకు వీలైనంత ఎక్కువ మందికి ఉత్తమ సాహిత్య ప్రజానీకానికి అందిస్తే సాహిత్యంపట్ల అనురక్తి పెరుగుతుందనే నమ్మకంతో ప్రచు పూర్వవిరాళ పద్ధతిని ప్రవేశపెట్టి సరస్వతీ సాక్షాత్కారం, జీవన గీత, కావ్యలహరి, చైతన్యల వికాసలహరి, వంటి సాహితీ తపోమూర్తుల సందేశాల నందించే గ్రంథాలను వేన సంఖ్యలో ప్రచురించి, ఉభయనగరాలలోని రసికులనే కాక యావద్భారత దేశం సాహితీప్రియుల మన్ననలను పొందగలిగింది. 'మారుతున్న విలువలు-రచయితల బాధ్య అనే ఒక గోష్ఠిని నిర్వహించి, ఆ గోష్ఠి వ్యాసాలను 'రచన'గా ప్రచురించింది. భారత స్వా రజతోత్సవ సందర్భంగా కడచిన 25 ఏళ్ళలో తెలుగు దేశంలో సాంస్కృతిక సాహిత్య సంబంధమయిన తీరుతెన్నులను వివరిస్తూ నూరుగురు ప్రముఖుల వ్యాసాల సం 'మహతి'గా ప్రచురించింది.

భారత దేశంలో ఎక్కడున్నా సరే- యువభారతి నిర్వహిస్తున్న సాహిత్యోద్యమంలో పాలు పంచుకోగలిగేందుకు రసికులకు సాహితీమిత్ర పథకాన్ని రూపొందించింది. ఇప్పటికి దాదాపు 6 వేలకుపైగా సహృదయులు సాహితీ మిత్రులుగా చేరినారు. ఈ సాహితీమిత్రుల సాహితీ వికాసానికి తోడ్పడేందుకు ఒక కవితా సంకలనం 'ఉషస్సును', 'కథావాహిని' అనే రెండు కథాసంకలనాలను ప్రచురించింది. యువభారతి సభ్యుల కవితా, కథాసంకలనాలు, 'వీచికలు-అక్షరాలు-స్వరాలు-ఉదయం' కూడా వెలువడినవి.

యువభారతికి మూలనిధి ఏర్పరచి దానివల్ల వచ్చే ఆదాయంతో ఈ సాహిత్య కార్యక్రమాలను మరింత సుకరంగా, ప్రయోజనాత్మకంగా, విస్తృతంగా నిర్దుష్టంగా నిర్వహించాలనే ఉద్దేశంతో రూపొందించి గత డిశంబర్‌లో ప్రారంభించబడిన శాశ్వతజీవిత సభ్యత్వపథకాలలో ఇప్పటికి 'భారతీమిత్రులు'గా దాదాపు 350 మంది, భారతీ భూషణులుగా దాదాపు 35 మంది చేరారు. మా సాహిత్యోద్యమ కృషిలో పాలుపంచుకునేందుకు వాగ్దానం చేశారు.

జంటనగరాలలో వేనవేల సంఖ్యలో భాషాభిమానులను ఆకర్షించి, పెద్ద ఎత్తున సాహిత్య సభలను యువభారతి నిర్వహించగలిగింది. తెలుగు సాహిత్యం గురించి తెలుగు వారికి తెలుపడమే కాదు-అన్యభాషీయులకు గూడా తెలుపబూనుకోవడంలో ఔచిత్యముందని అలాగే అన్యసాహిత్య సంస్కృతుల విశేషాలను తెలుగువారు తెలుసుకోవలసిన అవసరం ఎంతయినా ఉందని మా విశ్వాసం. దీనికి నాందిగా 34 ఇంగ్లీషు వ్యాసాల సంకలనం 'Free India Forges A head' ను వెలువరించింది.

బమ్మెరపోతన భాగవతంలోని యాభై రెండు పద్యాలను 'మందార మకరందాలు'గా మహాకవి డా॥ సి. నారాయణరెడ్డిగారి కమనీయ వ్యాఖ్యతో ప్రచురించి, లక్షప్రతులు అందించాలనే సంకల్పంతో రెండు ముద్రణల్లో 35వేలు ఒక రూపాయికే అందించి మూడవ ముద్రణకు పూనుకోబోతున్నాం. 'సాహితీ వాహిని'లో రెండవ తరంగంగా 'వేమన్న వేదం' మూడవ తరంగంగా 'భోగినీ లాస్యం' ఈ ఆనంద ఉగాదినాడు తెలుగు పఠితలకు అందజేస్తున్నాం.

మన తెలుగులోనే కాకుండా విశ్వసాహిత్యాన్ని తమ ప్రతిభాప్రభావాలతో సంపన్నం చేసిన మహనీయుల సందేశాలనుకూడా సాహితీవాహిని పరంపరలో వెలువరించాలని, ద్వైమాస పత్రికగా ఈ 'సాహితీవాహిని'ని నిర్వహించి ఒక్కొక్క సంచికలో ఒక్కొక్క కవినో, సాహితీప్రక్రియనో, విజ్ఞాన విషయాన్నో తెలుగు పాఠక లోకానికి అందించాలని ప్రణాళిక రూపొందించినాము.

ఉడుతాభక్తితో మేము చేస్తున్న భాషాసేవకు అండదండలుగా నిలిచింది ప్రజలు, వారి సౌహార్దం, భాషాప్రియత్వం, ఇదే మా పెట్టుబడి. మా తపస్సు ఫలించి తెలుగు దేశంలో అధ్యయన శీలతా, సౌజన్యం, పెంపొందాలని ఆకాంక్షిస్తున్నాం.

24-3-1974 — **ఇరివెంటి కృష్ణమూర్తి**

ఆనంద ఉగాది. — అధ్యక్షుడు

# ముందు మాట

*(తొలిముద్రణ ప్రతి నుంచి)*

**క**ళలు సౌందర్య విలసితములై యానంద సంధాయకములగును. భావనా సౌందర్యమే కావ్యకళగా- నాద సౌందర్యమే గానకళగా- అంగ సౌందర్య విన్యాసమే అభినయ కళగా రూపొందినది. వీనికి జనక స్థానములు మనోవాక్కరణములు. ఈ మూడు కళలును త్రికరణములవలెనే అవినాభావ సంబంధము కలవి.

కళలకు భావములే ప్రధానములు. అవే స్థాయీభావ, వ్యభిచారీభావ సాత్విక భావము లనబడును. ఇవి విభావానుభావయుక్తములై వ్యభిచారీభావ సంయోగము వలన పరిపుష్టములై స్థాయీభావ పర్యవసితములై సమగ్ర రసానంద సంధాయకములై యొప్పారునని ఆలంకారికులు నిర్వచించినారు. విశిష్ట విజ్ఞాన కారణమైనది విభావము. వాచికాంగిక సాత్వికాభినయాశ్రయములైన పెక్కు అర్థములు దీనివలన విశిష్టముగా తెలిసి కొనబడును. అనుభావమువలన వాగంగసత్వకృతాభినయములు అనుభవ యోగ్యములుగా జేయబడును. రత్యాది స్థాయీభావము లెనిమిది మరియు స్వేద స్తంభాది సాత్విక భావము లెనిమిది- నిర్వేద, గ్లాని, శంకాదులగు ముప్పై మూడు సంచారీ భావములును పరస్పర సంయోజితములై, నవరసములుగా రూపొందును. ఆయా రసానుగుణ్యముగా నిందుకొన్ని త్యాజ్యములును, మరికొన్ని గ్రాహ్యములునై యుండును. నవరసములలో శృంగార వీరములు ప్రధాన రసములు. అందు శృంగారము నవరసములకును రసరాట్టనబడుచున్నది. ఆలస్యము, ఉగ్రత, జుగుప్స, అనునవి తక్క తక్కిన 46 భావములీ శృంగార రసమున నుపయోగింపవచ్చును. ఇది విప్రలంభము, సంభోగమని ద్వివిధములై యున్నది. ఈ శృంగారమునకు స్త్రీ పాత్ర ప్రధాన భూమిక యనవచ్చును. స్త్రీ తాను భావనలో, నాదములో, అవయవ నిర్మాణములో అంగ విన్యాసములో కోమలతయు మనోజ్ఞతయు విశేషముగా గల్గియుండును. వీర రసములో పురుషుని పాత్ర శోభించునటులు స్త్రీ పాత్ర శృంగార రసాభినయాదులలో విశేషముగా శోభించును.

ఆడదానికి లాస్యమనియు మగవానికి తాండవ మనియును వ్యవహరింపబడుచున్న నాట్యములు విధింపబడినవి.

స్త్రీ యొక్క సాత్వికాంగిక వాచికాభినయములవలెనే, యాహార్యరూపములగు వస్త్రాభరణాదులును శృంగారరస ప్రసాధనములై మిక్కిలి మనోజ్ఞములై చిత్తాకర్షకములై యుండును. అందులకే ఉద్ధృతమగు పురుష తాండవముకన్న స్త్రీ లాస్యము సౌకుమార్య సంశోభితమై ప్రసన్నమై రంజనము నొనగూర్చును.

ప్రస్తుత మిందు భోగినీలాస్యముక్తమగుచున్నది. పట్టాభిషిక్తురాలు కాని రాజు భార్యను భోగిని యనుట రూఢిగానున్నది. కావున భోగినిని సింగభూపుని పట్టంపురాణిగాని భార్యగా భావించనైనది. అప్పుడే భక్తి జ్ఞాన వైరాగ్య రాశియగు పోతన కవీంద్రుడు భోగినినిగూర్చి దండకమును వ్రాసెననుటకు నవకాశ మధికముగా నుండును. "స్త్రీ రత్నం దుష్కులాదపి" అని ధీరోదాత్తుడగు సింగభూపాలుడు తానీమెను పాణిగ్రహించెననుట సమంజసమే యగుచున్నది. నాట్యమును కావ్య రూపములో రసానంద భాజక మగునట్లు వ్రాయబూనుటయే సాహసముతో గూడిన కార్యము. ఐనను సహృదయులు దీని నామోదించి యానందించుట గాంచ మత్పురాకృత పుణ్య విశేషమే యనవలెను. ప్రసంగ వశమున పోతన చరిత్ర యను మహాకావ్యములో భోగినీ లాస్యమును రచించుట లయ్యెను. నిజమైన ఆంధ్ర భారతీ భక్తులగు యువభారతీ వారు, దీనిని విశేషార్థ వివరముతో ప్రకటించదలచుట వారి కెంతయూ నా కృతజ్ఞతలు. కాని మూల రచయితనగు నన్నే వ్యాఖ్యాన రచయితగా వరించుట అనుచితమైనను వారి మాట త్రోసివేయరానిదగుట సమ్మతించవలసి వచ్చినది. యువభారతి కోరుటయు నాయీ వృద్ధభారతి దాని గాదనుటయు నెట్లు పొసగును? ఇందు పొందుపరచిన విశేషార్థాలు ఆత్మగుణ కథనముగా గాక వినమ్ర వదన పూర్వక విజ్ఞప్తిగా పండిత లోకము భావించవలెనని మనవి చేయుచున్నాను. సర్వజ్ఞుడనుకాను కావున నిందలి దోషములను మన్నించ ప్రార్థించుచున్నాను.

24-3-74

ఆనంద ఉగాది

ఇట్లు



'చుట్టూరా ఆవరించుకొని ఉన్న చీకటిని
తిట్టుకుంటూ కూర్చోవడం కంటే ప్రయత్నించి
ఎంత చిన్న దీపాన్నైనా వెలిగించటం మంచిది'
అన్న వాక్యమే యువభారతికి ఊపిరి



# యువభారతి ఫౌండేషన్

రిజిష్టర్డ్ సంఖ్య-151/2008

**పరిచయం:** "చుట్టూరా ఆవరించుకొని ఉన్న చీకటిని తిట్టుకుంటూ కూర్చోవడంకంటే, ప్రయత్నించి ఎంత చిన్న దీపాన్నయినా వెలిగించడం మంచిది" అన్న వాక్యమే ఊపిరిగా 1963లో విజయదశమినాడు యువభారతి సాహితీ సాంస్కృతిక సంస్థ ఆవిర్భవించింది.

**యువభారతి పరిచయం:** ఉత్తమ సాహిత్యాధ్యయనం సమాజంలో సామరస్యాన్ని పెంపొందిస్తుంది. మనిషిలో అంతర్లీనంగా, నిక్షిప్తమయిన ప్రతిభను వెలికి తీస్తుంది. సాత్వికతను పెంపొందించి, సగటు మనిషి 'మనీషి'గా తీర్చిదిద్దుతుంది. అన్నది యువభారతి నమ్మకం. ఈ ఆశయ సాధనకు కడచిన 45 సంవత్సరాలుగా అనేక సాహితీ, సాంస్కృతిక కార్యక్రమాలను నిర్వహించి, 'లహరీ' ఉపన్యాస పరంపరల నేర్పాటు చేసి, ఉన్నత ప్రమాణాలుగల అనేక గ్రంథాలను ప్రచురించి, తెలుగువారి హృదయంలో స్థానాన్ని పొందింది.

**యువభారతి ఫౌండేషన్:** మీరందించిన ఈ స్థానాన్ని పదిల పరచుకొని, తెలుగు భాష, సాహిత్య, సంస్కృతులను మరింత అభివృద్ధి పరచి, తెలుగువారిలో మాతృభాషాభిమానాన్ని పెంచి, వారిని ఉత్తమ పౌరులుగా తీర్చి దిద్దడానికి ఒక శాశ్వత నిధినేర్పాటు చేయాలని భావించి, యువభారతి మిత్రులతో కలిసి, "యువభారతి ఫౌండేషన్" పేర ఒక శాశ్వత నిధిని ఏర్పాటు చేయడం జరిగింది.

## మీ వంతు సహకారాన్ని మీరెలా అందించగలరు?

మీరు ఈ మా ఉద్యమంలో పాలుపంచుకోవాలనుకుంటున్నారా? అయితే మీవంతు సహాయ, సహకారాలు మీరీ క్రింది విధంగా మాకందచేయవచ్చు.

- మీరు సాహితీ వేత్తలు, తెలుగు భాషాభిమానులు అయితే మీ చక్కని సూచనలను, సలహాలను, మాకందించి మా కార్యక్రమాల రూపకల్పనలో మీ వంతు సహకారాన్ని మాకందించవచ్చు.

- మీరు "మాతృభాష" పై అభిమానం కలవారైతే మీ అమూల్యమైన సమయంతో కొంత సమయాన్ని "యువభారతి ఫౌండేషన్" కార్యకలాపాల నిర్వహణలో వెచ్చించి, మాతో సహకరించవచ్చు.

♦ మీరు ఉద్యోగ వ్యాపారాలలో తీరికలేని వారైతే "యువభారతి ఫౌండేషన్"కు విరివిగా విరాళాలనందించి ప్రోత్సహించవచ్చును. మీరిచ్చే ఎంత చిన్న మొత్తాన్నైనా, "యువభారతి ఫౌండేషన్" వినమ్రంగా స్వీకరిస్తుంది.

## యువభారతి ఫౌండేషన్

**ఇ.నెం. 3-6-207/1, మక్దూం మార్గము, 15వ వీధి, హిమాయత్ నగర్,**

**హైదరాబాద్- 500 029. సెల్: 924 732 8440.**

తెలుగు సాహితీ వేత్తలు, భాషాభిమానులు, తల్లులు, తండ్రులు, గురువులు, అధికారులు, అనధికారులు, విద్యార్థులు, యువతీ యువకులు యావన్మంది తెలుగువారు తమ భాషాభిమానాన్ని ప్రదర్శించి, "యువభారతి ఫౌండేషన్" కార్యక్రమాలకు తమ హార్థిక, ఆర్థిక సహాయ, సహకారాలను అందించి ప్రోత్సహిస్తారని ఆశిస్తున్నాము.

యువభారతి ఫౌండేషన్ తరపున

| ఎ.నాగేశ్వరరావు | ఎ. రామలింగేశ్వరరావు | డా. వంగపల్లి విశ్వనాథం |
|---|---|---|
| కోశాధికారి | మేనేజింగ్ ట్రస్టీ | అధ్యక్షుడు |

# యువభారతి

## సాహితీ సాంస్కృతిక సంస్థ

### అందుబాటులో ఉన్న మా ప్రచురణలు

| క్ర.సంఖ్య | ప్ర.సంఖ్య | పుస్తకం పేరు | వెల.రూ. |
|---|---|---|---|
| 1. | 95 | మాఘ కవితా వైభవం | 5.00 |
| 2. | 96 | స్వామి వివేకానంద కవితా వైభవం | 5.00 |
| 3. | 97 | సంస్కృతి | 5.00 |
| 4. | 100 | సంస్కృత సాహితీ లహరి | 20.00 |
| 5. | 105 | చిలకమర్తి కవితా వైభవం | 5.00 |
| 6. | 109 | వ్యాస సూక్తం | 8.00 |
| 7. | 110 | వ్యాస సాహితీ సంహిత | 20.00 |
| 8. | 115 | జగద్గురు సాహితీలహరి | 20.00 |
| 9. | 116 | బాబా ఫరీద్ సూక్తులు | 5.00 |
| 10. | 119 | తెలుగు బాల సాహిత్యం | 5.00 |
| 11. | 121 | నవ్య సాహితీ లహరి | 20.00 |
| 12. | 125 | ఈ దశాబ్దంలో తెలుగు సాహిత్యం(1980-90) | 20.00 |
| 13. | 127 | యువత | 25.00 |
| 14. | 132 | ఇరివెంటి రచనలు | 25.00 |
| 15. | 141 | అనుభూతి | 20.00 |
| 16. | 145 | కొత్త గొంతుకలు-సరికొత్త విలువలు | 25.00 |
| 17. | 146 | మానవతా మూల్యాలు | 25.00 |
| 18. | 149 | సాహితీ సమాలోచనం(1992-93) | 30.00 |
| 19. | 150 | తెలుగు తమిళ కవిత్వాలు-జాతీయవాదం | 25.00 |
| 20. | 160 | విశ్వనాథ సాహితీ సమాలోచనం | 100.00 |
| 21. | 162 | స్వాతంత్ర్య స్వర్ణభారతి | 20.00 |
| 22. | 163 | దివాకర్ల వేంకటావధాని | 150.00 |
| 23. | 167 | నవజీవనం | 30.00 |
| 24. | 175 | మరో జంఘాల శాస్త్రి | 140.00 |
| 25. | 176 | వేద విజ్ఞాన లహరి | 100.00 |
| 26. | 177 | విజయానికి అభయం | 30.00 |
| 27. | 178 | ఉపనిషత్ సుధాలహరి | 160.00 |

# భోగినీ లాస్యం

1. అనఁగనె జయదేవాష్ట ప
దిని గొని యొకకొంతసేపు తియ్యని భావా
భినయంబు నృత్యగతి తో
నొనరింప న్నిల్చెఁదల్లి యొగి హంగు నిడన్.

సాహిత్య సామగానానందం గీతగోవిందం. ఇది పద్మావతీ పాదపద్మ లాస్యమునకు జయదేవ కవి విరచించిన రస సరస్సు. ఈ కావ్యమందలి కవితాధార తలక్రిందులు తపమొనర్చి రాధయై గోపికానాథుని ప్రణయమును గుత్తగొన్నది. ఇందలి యష్టపదులు సంస్కృత గేయ వాఙ్మయంలో మనోజ్ఞములైన శృంగార సుధారస గంగా తరంగాలు. రాధాకృష్ణుల ప్రణయ స్వర్గ సామ్రాజ్యమునకు పట్టిన నిల్వుటద్దాలు. ఈ యష్టపదులు వివిధ రాగ తాళ విలసితములై సంగీత సాహిత్య సౌభాగ్యాలతో సరసుల పరవశింప జేయడంలో పరాకాష్ఠ నందుకున్నాయి. గోపికల యనురాగాలే అందలి రాగాలు. ఆ ప్రేమ స్వరూపునిలో లయించిన వారి చిత్తవృత్తులే ఆ లయలు.

గోపాలునిపై రాధకు ఎంతటి అనన్య ప్రేమయో ఈ భూపాలునిపై తనకు నలాంటి అవ్యాజానురాగం ఉండడం వలన ఆ యష్టపదులు తన విరహ ప్రేమార్తికి మారు రూపాలై మనస్సును విప్పి చెప్పగలవని భోగిని అష్టపదిని గొని అభినయించింది. తానితరుల నెందుకు వరించలేదో, సింగభూపాలుని వరించడానికి అతనికి గల యోగ్యతలెన్నో తనకా భూపతిపైగల అనురాగ మెంత ప్రగాఢమైనదో చూస్తేకాని తెలియదని తన తల్లిని హంగు జేయడానికి నియమించింది. సరసత సంస్కారం సౌందర్యం లేని కేవల ధనయౌవనాలు తనవంటి సౌందర్యవతిని విదుషీమణిని ఆకర్షించజాలవని వాచ్యం కాకుండా సూచ్యంగా తల్లికి తెలియజేసింది.

2. చెక్కి చేసిన మోహినీశిల్ప మనగ
దిద్ది తీర్చిన నవరత్న దీపమనగ

పోత వోసిన యపరంజి బొమ్మ యనగ
అచ్చ మచ్చరయే యన నాలతాంగి.

సౌందర్యమునకు ప్రధాన కారణాలైన రంగు రూపులలో రంగు ఎలా ఉన్నా రూపములోని యంగ సౌష్ఠవము చెక్కిచేసినట్లు తగుపాటి వంపు సొంపులతో నుంటేనే తప్ప మోహింపజేయు మోహిని కాలేదుగదా! పోతవోసి నట్లున్న ఆ రూపానికి తోడు రంగారు బంగారు వన్నె యున్నదంటే అత్యంతం హృదయాన్ని ఆకర్షిస్తుంది. ముత్యాలవంటి పలువరుస, పగడం వంటి అధరం, వజ్రాల కాంతులు వెదజల్లే కనులు, ఇంద్రనీలాలవంటి యామె కురులు మొదలైనవి, పలు వర్ణములలో ప్రకాశిస్తుంటే దిద్దితీర్చిన నవరత్న దీపంలా స్ఫురించింది. తాను ఇంద్రుని యవతారమైన సింగధరణీపతికి తగిన రంభనేనని నిరూపించుకొనడానికి రెప్పవాల్చకుండా అతని దర్శిస్తున్నది. దీని తరువాతి పద్యంలో వివరంగా దాన్ని చూడవచ్చు.

3. క్రొన్ననయంజలి న్వెలుఁగ గొమ్మయొ బొమ్మయొ యంచు ప్రేక్షకు
ల్సన్నుతిసేయ శ్వాసగొను చందము నేర్పడ నీక యింతయున్
గన్నుల రెప్పవేయకయె కాలును వ్రేలు గదల్పకుండఁ దా
నన్నరనాథుమున్నిలిచె నద్భుతమంది యతండు గాంచగన్.

తీవల కొనగొమ్మల్లో పూయు పూలగుత్తుల్లా ఆ లతాంగి పాణి యుగ్మంలో ప్రకాశిస్తున్నవి పూలు. భూపాలుని రూపాతిశయం రెప్పవాల్చకుండా విప్పారిన కనులతో గాంచి విస్తుపోయి, చేష్ట లుడిగి శిల్పపు బొమ్మలా నిల్చింది భోగిని. ప్రేక్షకులు "ఈమె నిజంగా కొమ్మయేనా లేక బొమ్మను నిల్పినారా!" అను సందేహంలో పడిపోయినారు. రెప్పవాల్చకుండా నుండ గల యప్సరసను నేనని చెప్పక చెప్పుతున్నది. నృపాలుడు కృపాలుడై పరి గ్రహించవలెనని యా సుందరి, నీవే నా ప్రాణం నీ వుంటే నాకీ శ్వాసతో గూడ పనిలేదని గాలి పీల్చడం మానివేసిందేమో?

4. కదలెను పల్లవమ్ము లనఁగా నధర మ్మదరెం బ్రకంపిత
మ్మొదవు లతాంతగుచ్ఛ మన నొద్దిక నట్టిటు లూగె గ్రీవయున్
బ్రిదులు ప్రసూనయుగ్మ మన వీక్షణము ల్చెలఁకాడెఁ దీవియన్
వదలిన పూలజల్లన సభ న్వెదజల్లఁబడె న్సుమాంజలుల్.

లతాంగులైన స్త్రీలు పూలవంటి నవ్వుల వెదజల్లుతూ మనోజ్ఞ వాసనల గుబాళింపులతో మనస్సును ఆకర్షించి మత్తెక్క జేస్తారు. అదరిన యధరంలో పల్లవాలు కదలాడాయి. ఈ పల్లవాలు రాగరక్తిమల జిందుచూ మల్లె మొగ్గలవంటి పల్లు వరుసతో వసుధాధిపుని గుండెలో కుసుమాస్త్రాల గుప్పి వశపరచుకో జూస్తున్నది. పూ విలుకాని యమ్ముల పొదివలె గ్రీవ ఠీవిగా నొయ్యారా లొలకబోస్తూ నిన్ను నేను మెచ్చినా ననునట్లు తల నాడించింది. అంతలో నావరించిన లజ్జా వాతావరణాలు కలువ కనుగొనల చలింపజేశాయి. ఆ కందమ్ములలోని ప్రేమ వాసనలు వ్యాపించాయి. గాలి రాపిడికి రాలిన పూలజల్లులై వాలు చూపుల వర్షం కురిసింది. దానిలో మునిగి సభాసదనం మురిసింది.

ఈ పుష్పాంజలి ప్రసారహస్తఃమును పుష్పపుటహస్త మందురు. ఇది సంయుతము.

5. కాళుల నందియల్ చిలిపి గజ్జెలు ఘల్లనె, జల్లనెన్ మహీ
పాలుని మేను కెంజిగురు వాతెఱ నవ్వుల పూలు బూచె నా
లీల మరుండు మేల్మఖుమలీ యొఱలోపలి చంద్రహాసమున్
గేలను దూసె, నద్ది గిలిగింతలు చేసె సభాసముద్రమున్.

కమలానికి గతి యబ్బినట్లు కదలింది కాలు. భ్రమపాలవలె పారిషదుల కనీనికలు ఆమెపై వ్రాలాయి. సుమశరుని నారీటంకారములై కాళ్ళగజ్జ లందెలు సందడించాయి.

• చారి సాగింది. కరణ రూపం కదలింది. ఖండములు మండలాలై నర్తించినాయి. ఆ ధాటికి తాళనని కంచు కోటలాంటి కాయములో నున్న మంచు కొండవంటి మహీపాలుని మనసు జలదరించింది కరగిపోయింది. చివురుల మధ్య పువ్వులు విచ్చినట్లు చిరునవ్వులు పెదవులలో మెదలసాగాయి. మందారపు టందాలతో పందెమ్మిడు పెదవుల దూసికొనివచ్చు మందహాసము మఖుమలీ యొరను ద్రోసికొనివచ్చు మదనుని చంద్రహాసమై సభా సముద్రము నుప్పొంగ జేసింది. చంద్రుని గాంచి జలధి పొంగుట సహజమే.

---

• ఊరుకటీ–పాదజంఘులయొక్క కర్మల పరస్పర సంయోజితమైన చేష్ట చారి యనబడును. అభినయమందు హస్తములె గతియందు పాదము రచించుట చారియగును. ఏకపాద ప్రచారముల చారి రెండు పాదముల ప్రచారము కరణము. మూడు కరణముల సమావేశము ఖండము. నాల్గు ఖండముల సంయోగము మండల మగును.

6. కసిగొని తంబురా శ్రుతులఁ గమ్మని తుమ్మెద ఝుంకృతిధ్వనుల్
ముసరెను వేణువీణియల మూల్గెను గానకళావిలాసముల్
దెసల తధిమ్, తలాంగ్, త్రకిటి, ధిక్కిట, క్డామ్ తకధిమ్, తతెయ్యి మం
చెసఁగె మృదంగనాద మిటు లీఁగయు వ్రాలిన మ్రోఁగు మేల్సుతిన్.

కమ్మని తుమ్మెద ఝుంకారములవలె శ్రుతులలో తంబురా శ్రుతులు మ్రోగసాగాయి. గాన తానాలు వీణాతంత్రులలో విలాసంగా ముగ్ధాంగనలవలె మూల్గుచు మూర్ఛనలు దీర్చుచున్నాయి. ఈగ వ్రాలినా మ్రోగునంత సున్నితముగా సుతి జేయబడిన మృదంగ నాదాలు, దెసలలో "తధిమ్ తళాంగ్ త్రకిట ధిక్కట క్డాం తకధిం, తతె"య్యని, ఓంకారాల నాలకబోస్తూ పేలాలు వేగినట్లు సప్త తాళాల జతుల గూర్చి భోగినీ లాస్యాలకు ప్రోత్సాహమిస్తున్నాయి. నాగస్వర నాదము విని లేచియాడు భోగివలె భోగిని ఉత్తేజం పొందుతున్నది.

7. మిసిమి పసిండిమై తళుకు మించులు సంచలదంబరాంచలా
వసథము మాటుదాఁటి వెలివచ్చిపడం గనుగుట్టునట్టి మే
ల్పస గల రంగురూపులకుఁ బమ్మయు రిమ్మగొనన్ త్రిభంగి మే
నెసఁగనొయార మొల్కఁగ నటేశుని యాకృతిఁగూర్చి మ్రొక్కిడెన్

పసిండి కాంతి పసల మించు, మించులవంటి మేని తళ్కులు వలిపెంపు వలువను దాటివచ్చి బయటబడి బ్రహ్మ కనులకును కై పెత్త జేయుచుండ మువ్వంపుల మురిపించు నటేశుని యాకృతి నభినయించింది.

"ఆంగికం భువనం యస్య వాచికం సర్వవాఙ్మయం
ఆహార్యం చంద్రతారాది తం వందే సాత్త్వికం శివం"

అని భక్తి పారవశ్యంతో నా నాట్యాచార్యునకు నమస్కరించింది. మహేశ్వరుడు తాండవ లాస్యములకు ఆదిగురువైనాడు. ఈ తాండవము 7 విధములు. ఆనంద తాండవం, సంధ్యా తాండవం, కలిక తాండవం, విజయ తాండవం, ఊర్ధ్వ తాండవం. ఉమా తాండవం, సంహార తాండవం అని. నృత్త నృత్య నాట్యములను మూడును భరతముని గ్రథితములు. నృత్తము కేవల మవయవ చలనము గలిగియుండును. నేత్ర, భ్రూ, ముఖ, హస్త, భుజ, వక్షోజ, కటి పాదాంగుళుల చాలనము నృత్తము. నృత్తమునకు తోడు గాన,

పాఠ్య వ్యక్తీకరణ మమరిన నృత్యమగును. నృత్యము భావాశ్రయము, నాట్యము రసాశ్రయము. నృత్త నృత్యములకు భావ రాగ తాళము లవసరము కాని నాట్య మొక్కొకసారి రాగ తాళముల యవసరం లేకుండగనే అభినయించవచ్చు.

8. *సింగ భూపాల! సుకవితా శ్రీవిలోల!*
*వీర పరిపంథి శీర్ష కోటీర హీర*
*మణిమయూఖ నీరాజిత మహితమసృణ*
*పాద పంకేరుహా! జయీభవ! యటంచు.*

ప్రహ్లాద రక్షణచేసే సింహావతారుడవైన భూపాల! 'ప్రహ్లాదా'న్ని నా ఆనందాన్ని రక్షించు. సత్కవిత్వ రసానంద శ్రీ యందు లౌల్యబుద్ధి గలవాడా! శృంగార రసార్ణవ సుధాకరుడవైన నీవు గొప్ప సరసుడవు. తదానంద విరోధులైన శత్రు నృపాలురను నిర్జించినావు. వారి నమ్ర శిరస్సులలో నలరు నవరత్న మకుటములు నీ పాద పంకేరుహాలకు నీరాజనా లిస్తున్నాయి. ఎంతటి శృంగార రసకోవిదుడవో యంతటి వీర రసమూర్తివి. నిన్ను దక్క విజయలక్ష్మి మరెవరిని వరించగలదు? వంగి నమస్కారం చేస్తున్న శత్రువుల శిరోజాలు నీ పదాలపజ్జ నల్లగా వ్రేలాడుతూ ఉండే పంకమునందు బుట్టిన పద్మాలవలె నీ పాదాలు శోభిస్తున్నాయి.

**ఆది తాళము**

9. *తద్ధి–తక తధిమితకిట తక ఝుంతా–జగ తతోంగదిరి గుదు–*
*తకరుంతా–దిరుగుదు ఝుంఝుం కిణ జగణంత–జగణంతక–*
*తగణంతక–తకరుంతక–తకఝుంతక–తకిణం–తకరుం–తకుందరి*
*కిటతక–తరిత తరితధిమి–తధిమితకిడతక తకతా–తెహిదత్తతా*
*ఓ రాజా! రాజాధిరాజ సురతేజా! సర్వజ్ఞ సింగనృపభోజా!*
*రసవాగ్వికచముఖాంభోజా! ఆశ్రిత కవి కల్పకభూజా!*
*పుంభారతీ! కరుణామతీ! నరసింగా! శాత్రవ మదతిమిర పతంగా!*
*వాణీపద సరసిజ భృంగా!*
*వనితాజన నయనానంగా! స్మరశరనిభ రుచిరాపాంగా!*
*మదనాకృతీ! వాచస్పతీ!*

(పైన గల మృదంగజతి "సలాం శబ్దము"గా వ్యవహరింపబడుచున్నది)

అమృతప్రదుడగు చంద్రునివలె నా కన్ను కలువల వికసింపజేయు సుందర రూపుడవగు రాజచంద్రా! ఆ చంద్రునకు రాజువై దేవ తేజో విరాజితుడవైన ఇంద్రావతారుడవు నీవే. ఆ ఇంద్రునకును లేని సర్వజ్ఞత్వము గలవాడవు నీవు. భోజునివలె గీర్వాణ వాణీపతివై కవిపండితుల నాదరించుచు ఆశ్రితులకు కల్పవృక్షమ వైనావు. రసవాక్సరసిలో నెప్పుడు వికసించు ముఖాంభోజము గలవాడవు. పుంభావ భారతివి. మనకు శత్రువగు మదనుడు గూర్చు కామాంధకారము బాపనోపు సూర్యుని గల వాడవు. వనితల పాలిటి నవమన్మథుడవు. నీ యపాంగావలోకనములు నాకు కుసుమ శరములై గ్రుచ్చుచున్నవి. నేనింక తాళలేకున్నాను. నీ ముఖ కాంతితో నీవొక చంద్రునివలె గనబడుతున్నావు. చంద్రునకు లేని రాజ్యవైభవమున్నది కావున నతనికి నియామకుడవగు నింద్రుడవేమో? ఇంద్రునకు లేని విద్యావిజ్ఞానము గల వాడవు నీవు సర్వజ్ఞుడవైన శివుడవేమో? నాలుకపై నర్తించు వాణిని గాంచ నీవు బ్రహ్మావతారుడవగు భోజరాజువేమో? నీ వెవరైనను దేవతలలో నొకడవు కావున రంభ నగు నేను నీకు భోగ యోగ్యను.

10. వేదము లుద్ధరించి బలు వీఁపున నద్రి ధరించి కోరపై
మేదిని నుంచి దైత్యుఁ గసిమీర వధించి బలిం గలంచి భూ
పాదుల ద్రుంచి రావణు లయంబొనరించి హలమ్ముబూన్చి హిం
సాదుల మాన్చి మ్లేచ్ఛకులహత్యఁ జరించు హరి న్నుతించెదన్.

వేదశాస్త్రాలనడం నామైక దేశ గ్రహణంవలన వేద సారములు శాస్త్రము లనబడడంవల్లనూ అలంకారాది శాస్త్రాల నుద్ధరించినవాడవు. వీపుపై రాజ్య భారమును పర్వతంలా ధరించావు. కోరమీసపు పౌరుషాధారాన భూమిని దాల్చినవాడవు. ప్రజా పీడకులగు రాక్షసుల సింహాఖ్యతో ద్రుంచి ప్రహ్లాద (ఆనంద) రక్షణం గావించావు. (బలి) బలవంతుల తలదన్నే పరాక్రమంతో త్రివిక్రమునివలె విక్రమించావు. గర్వితులైన సమస్త రాజులను పరాభూతుల గావించినావు. (రావణ) లోకముల నేడ్పించు వారలను నిర్దాక్షిణ్యంగా చంపినావు. హలము–అనగా కృషి–ఆయుధమునకు ప్రాముఖ్యం గల్గించి తద్వారా రైతులను కాపాడినావు. హింసాకాండ నణచిన ప్రబుద్ధుడవుగా పేరందినావు. మ్లేచ్ఛుల హతమార్చి " నా విష్ణుః పృథివీపతిః" అనునట్లు స్తుతిచేయ బడినావు. ఇట్లు రాజున కన్వయిస్తున్నవి ఈ పద్యంలోని దశావతార విషయాలు.

### త్రిపుట తాళము

11. తగధింత తాంహత ధీనుత తద్ధీనుత తాను ధణాంతరి
తఝుంతరిత తఝుంఝుంతరిత తఝుంతరిత ఝుంతక రేకిణ
తడికు డిడికు డిడిడికు డింకికు, తక్కిణనగ తకుందరి కిణసగ
తకుందరికుంద ధికుందరి తకుందక
జలధి నిహతవేదావనచణ విలసద్ఘననౌకాభకరణ!
ఖలసోమకదైత్యనిబర్హణ బలశోభిత మీనశరీరా!
మందర గిరికృత వరగోపుర సుందరతను మందిర మహీధర
బృందారక సుధాప్రదాశ్రిత మందారా కూర్మాకారా!
పిశితాశనవధా కథాంచిత దశనాగ్ర విలగ్న మహీకృత
శశిమగ్న కళంక కళాధృత విశదాంగా వరాహరూపా!
కరభుజగ నఖర దంష్ట్రాహృత హిరణ్యకశిపు ప్రాణాశన
వరభక్త ప్రహ్లాదావన వరదా! నరహర్యవతారా!
బలిదత్త త్రిపదావని ధనవిలసిత విక్రాంత త్రిభువన!
బలిమస్తక ధృత పదపావనతల! శ్రీ మద్వామనరూపా!
క్షత్రియ కులగోత్రవిఖండన సుత్రామ! పరశుపవిమండన!
శాత్రవ మదగర్వాంధతమసమిత్రా! శ్రీ భార్గవరామా!
దశదిక్పాలామర కామిత దశముఖ పశుబలి దాననిరత
నిశాట మదగజ కంఠీరవ! దశరథాత్మజా! రఘురామా!
లలితశేష లావణ్యాజిరతులిత మసృణ ధవళ కళేబర!
జలదిసదృశ వరకృష్ణాంబర హలముసలధరా! బలరామా!
యాగస్థిత పశుహింసానల వేగాంతక కరుణాంబుధి జల
త్యాగాస్త్రవిజిత భవశృంఖల శ్రీ గౌతమ బుద్ధశరీరా!
ఉరు యవన వనాగ్నిజ్వాలా! కరధృత భీకర కరవాలా!
వరదనుత జగత్పరిపాలా! తురగస్థిత కల్క్యవతారా!

ఈ జతి దశావతార శబ్దమను పేర వ్యవహరింపబడుతూంది (2 అక్షరాల కాలము గల త్రిపుటతాళ బద్ధమిది). ఇందు విష్ణువు దశావతారములు వర్ణింపబడినాయి. 1. సముద్రములోమున్గిన వేదాలనుద్ధరించడానికి పెద్ద ఓడవంటి శరీరము ధరించిన మత్స్యావతారా! 2. బ్రహ్మాండము లన్నిటికిని మందిరమగు శరీరముపై మందరపర్వతము శిఖరమువలె నందగించనొప్పు కూర్మాకారా! 3.చంద్రునిలోని మచ్చను వలె తెల్లని కోరపై నల్లని భూదేవి నుద్ధరించి యుంచిన శ్వేతవరాహరూపా! 4. పాణియను పామునకు గోళ్ళు కోరలుగాగా హిరణ్య కశిపుని ప్రాణ వాయువు భక్షించిన నృసింహావతారా! 5. బలి యిచ్చిన పాదత్రయ మాత్ర భూదేవిని గొని త్రిభువనముల నిండునంతగా పొంగిపోయి బలవంతులకు బలవంతుడ నేనను వామన రూపా! 6. క్షత్రియగోత్ర (పర్వతమును) ఖండించ పరశువనే వజ్రాయుధ ధారివైన ఇంద్రుడవా యనబడు పరశురామా! 7. దశదిశల సంరక్షార్థము దశముఖ పశువును బలినొసంగిన రాక్షస మదగజ రాజ కంఠీరవా! రఘురామా! 8. అంబుధి నివసించు ఆదిశేషునివంటి తెల్లని శరీరము దాల్చి ఆ శరీరమును జుట్టియున్న నల్లని సంద్రము వంటి నీలాంబరధారీ! బలరామా! 9.యాగపశు హింసాగ్ని జ్వాలల నార్పు కరుణారస సముద్రుడవైన శ్రీ గౌతమబుద్ధ స్వరూపా! 10.యవన వనమును గాల్చు నగ్ని జ్వాలవలె ప్రకాశించే అరిభయంకర మగు కరవాలమును ధరించిన కల్కిరూపా! నీకు నేను నా నమస్సుమనస్సు లర్పించుచున్నాను. ఇందు ఉత్ప్రేక్షలు రూపకాలంకారాలు ఉపమాలంకారాలు అందందు పొందు పరచ బడినాయి. మత్స్య కూర్మాది సంయుత హస్తముద్ర లిందు ప్రయోగింపబడును.

*12.* ముసిముసి నవ్వులా పెదవి మూలల దాఁగుడుమూఁతలాడఁగాఁ
బ్రసవమునొందె నందు నెలఁవంకలు చెంపకుఁ జేరలౌ కనుల్
గుస గుస లాడసాగెఁ జెవి కోనలతో నల సింగిణీల్బొమల్
గుసుమశరమ్ము లెక్కిడుచుఁ గోమలతన్ లతలై నటింపఁగన్.

చక్కని సెలవి మూలలు నొక్కక పరి వెలిగిమలిగి విందొసంగు మందహాసాలనే చంద్రవంకలకు జననీ గర్భములైన సంధ్యారుణ కాంతుల జాలువార జేయుచున్నవి. చెంపకు చేరెడేసిగానున్న విశాల నేత్రాలు ఆ కర్ణాంతములై యటిటు కదలునప్పుడు చెవి కోనలతో గుస గుసలు బెట్టుచున్నట్లున్నవి. మీరు విన్నది నిజమే ఈ రోజువలె సుందరుడే అని యా గుసగుసలు. ఇంద్ర ధనుస్సులవలె నింపుగొల్పు బొమలు చూపులనెడి

కుసుమాస్త్రముల నెక్కిడుచు కోమల లతాకృతుల నాటలాడుతున్నవి. చిరునవ్వులతో తరళములగు చూపులతో మురిపమీను బొమ లీవల నాట్యాలతో సరసుల హృదయాలు కదలింప జేయుచున్నవి. ఆ కోమలి సాత్వికాభినయ విశేషములు "ముఖములోని నేత్రదంత నాసాధర భ్రూహనుఫాల భాగాదులతో జూపు రసభావాభినయము సాత్విక మనబడుతుంది. ఇది ఉత్తమాభినయ మనబడును."

13. *మసలె వయోరమా మధుర మందిరదీప్తి నురోజయుగ్మమా*
*పసిఁడి పయోజషండములఁ బయ్యెదగాంగతరంగ మాలికల్*
*విసరెఁ దటిల్లతాప్రభలు వీరవిహార మొనర్చెఁ గౌనునన్*
*గొసరెను లోకలోచన చకోరము లా వదనేందు బింబమున్.*

పయస్సువలె పొంగిపోవు వయస్సు అనే శ్రీదేవికి మధురమైన మందిరంలా ప్రకాశించు వక్షోజాలనే బంగారుపద్మ ముకుళాలపై తెల్లని వలిపెంపు పయ్యెద గంగాతరంగాలై జారియాడుతుంటే తటిల్లతలు మధ్యంలో వీర విహారం చేస్తున్నాయి. ఆమె ముఖ చంద్రబింబాన్ని ప్రేక్షకుల లోచన చకోర పక్షులు దర్శించడానికి కొసరుకుంటున్నాయి. ఇందు రూపకాలంకారము స్ఫురిస్తూంది.

14. *పసిరిక పట్టుచోలమున బాహువిలాసము లాటలాడఁగా*
*మసృణ మృణాలనాళ వనమాధురు లుర్విని బర్వెఁ దేఁటులన్*
*గసరుచు బారలౌ కురులఁ గట్టిన కీల్జడ నల్లనాగమై*
*కసుబుసులాడె శ్రోణితటి గంతిడెఁ దంబురకాయ పొంకముల్*

ఆకుపచ్చని పట్టురవికతో నలరారి యందాల వెలిజిమ్ము ఆమె బాహువులు కమల నాళాలవలెనుండి హస్తముద్రల నభినయిస్తుంటే రంగముపై కమల పుష్పాల వన సౌందర్యం ప్రత్యక్షమౌతున్నది. తుమ్మెదల నీలివన్నెల నిరసించే బారెడేసి కురులతో గట్టి కీల్జెడ కసుబుసులాడే నల్ల త్రాచులా నర్తిస్తున్నది. తంబురాకాయ పొంకాలు, కదలియాడు నితంబాలలో గనపట్ట సాగాయి.

15. ఒడుపు నొదుగుఁగల్గి కడు కోమలత నొప్పి
యభినయించునట్టి యా లతాంగి

యొకొక యవయవమ్మె యొయ్యారములనిధి
కవనజలధి శిల్పకళల కవధి.

అందాలుచిందు ఆమె యంగాలు అభినయిస్తుంటే ఒయ్యారాలకు నిధులై కవిత్వానికి జలధులై శిల్ప సౌందర్యమునకు సీమాభూములై కనబడుతున్నవి.

16. చేయి మెదలుపఁ గానేమొ చెల్వుగుల్కుఁ
గాలుగదలుప నేమొ చక్కదన మొల్కు
గొంతువిప్పినఁ గోకిలల్ కొసరి పల్కుఁ
గొమ్మ చూపుల నింద్రజాలమ్ము సేయు.

చేయి మెదల్చినా, కాలు కదల్చినా, ఏమో అంద ముట్టిపడుతున్నది. కోయిలలు కూసినట్లు కంఠస్వరము కడు మధురంగా వినబడసాగింది. చూపులు నెల్లరిని వలబడవేయజూచు నింద్రజాలాలై యాటాడు తున్నాయి.

17. తమ్మిపూఁ బొట్టలంబోలెఁ దళ్కులీను
మట్టలన్ దమ్మిరేకులై మలఁగు వ్రేళ్ళ
నందచందమ్ములెల్లఁ దామణఁగి మణఁగి
వంగిచెప్పిన ట్లాడుచు వరలుచుండె

ఆమె మనికట్లు పద్మకోశాలవలె తళతళలాడుతున్నాయి. ఆ మనికట్టుపై నలరే వ్రేళ్లు పద్మ దళాలవలెనున్నాయి. ఆ వ్రేళ్లలో అందచందాలన్నీ అణగి మణగి వంగిచెప్పినట్లాడుతూ వరలి ఉంటున్నాయి.

18. త్రికరణ సమన్వయత్వముఁ దేటపరచు
సాత్వి కాంగిక వాచిక సహజవృత్తి
భావరాగ తాళాంచిత భరతనాట్య
భంగిమలఁ జూపె నాహార్యసంగతిఁగొని

సాత్వికము, ఆహార్యము, వాచికము, ఆంగికము అని నాల్గువిధము లభినయాలు. ఇందులో సాత్వికము హృదయగత భావాల ముఖంలో ప్రదర్శితం చేస్తుంది. వాచికము కంఠధ్వనిలో భావాన్ని ప్రదర్శనం చేస్తుంది. ఆంగికము కరాద్యంగసంగత సంజ్ఞలతో

భావాన్ని అభినయిస్తుంది. భావాన్ని రాగము రంజకంచేస్తే లయ ఆవేశ వంత మొనర్చి అను భావ్యంగా నొనరిస్తుంది. భావానికి హృదయం జనకస్థానమైనా ముఖం ప్రదర్శితం చేస్తుంది. రాగానికి వాచికం (వాక్కు) జనకస్థానం–తాళానికి కరచరణాద్యవయవాలు ప్రదర్శించే స్థానాలు. ఇవి మూడు పరస్పర మవినాభావ సంబంధముగల్గి భావాన్ని పుష్టివంతంగా మనోజ్ఞంగా రూపొందిస్తాయి. భావరాగ తాళసమ్మేళనమే భరతనాట్యమై యలరారుతుంది. భావానికి రాగతాళములు పూర్ణావిష్కృతినిచ్చి మనోజ్ఞమొనరించి అందిస్తాయి. కేవల తాళావేశములోని లయబద్ధమైన హస్తపాద విన్యాసము నృత్యమైతుంది. రాగతాళ సంయుతమగు అంగవిన్యాసము నృత్యమై అట్లే భావరాగ తాళసమ్మేళనముతో గూడిన అంగవిన్యాసము భరతనాట్య మనబడుతుంది. భావమునకు రాగతాళములు రంజకత చేకూర్చి పరిపుష్టినిస్తాయి.

19. హంసముఖాకృతి నలరించు నొకముద్ర
భ్రమరాకృతుల నొందు భ్రమను గొల్పు
హరిణముఖాకృతి అననొప్పునొక ముద్ర
యెగయు పతాకమై యెసఁగు నొకటి
శంఖచక్రాకృతుల్ సరిపోలు నొక ముద్ర
దర్పకబాణసంధాన ముద్ర
శిఖరాకృతుల నధిక్షేపించు నొక ముద్ర
యభయప్రదానహస్తాబ్జ మొకట

ముకుళముద్రల భుజలతల్ మొగ్గదొడుగు
బూర్ణ వికసిత ముద్రలఁ బూలుబూయు
వంపులగు వ్రేళ్ళఁ బూరేకు సొంపులీను
క్షితిఁ గదలియాడు లత యీనెలఁత యనంగ

ఇచటనామె అనేక ముద్రల ప్రదర్శించినట్లు చెప్పబడింది. హంసముఖ, భ్రమర, హరిణ, పతాక, శంఖ, శిఖరాది ముద్రలు అసంయుత ముద్రలు. అసంయుత ముద్రలు ఒకే హస్తంతో ప్రదర్శించేవి.

పతాక : అన్ని వ్రేళ్లును సన్నిహితములై చక్కగా చాచబడి ఒక అంగుష్ఠము

మాత్రము కుంచితమైయుంటే పతాక ఐతుంది.

హంసముఖ : తర్జని-మధ్యమ-అంగుష్ఠములు మూడింటిని చేర్చిపట్టగా తక్కిన రెండు వ్రేళ్లు చాచియుంచబడిన హంసముఖముద్ర అనబడుతుంది.

భ్రమర : నడిమివ్రేలు అంగుష్ఠము ఒండొంటిని తాకియుండగా తర్జని వక్రంగా ఉండి తక్కిన రెండు వ్రేళ్లు చాచియుంచిన భ్రమరముద్ర అనబడుతుంది.

హరిణముఖ : మృగశీర్షమువలెనున్న ముద్ర హరిణముఖమనబడును. ఇది సర్పశిరోహస్తమందలి చిటికెనవ్రేలు బొట్టనవ్రేలు ఊర్ధ్వంగా చాచి తక్కినవ్రేళ్ళ అధోముఖంగా ముడిచిన నేర్పడుతుంది.

శంఖ : కుడిచేతి అంగుష్ఠం ఎడమముష్టిలో బొనిపి కుడిచేతి తక్కిన నాల్గువ్రేళ్ళ ఎడమ పిడికిలిపై చాచియుంచితే ఏర్పడుతుంది. ఇది సంయుత ముద్ర.

శిఖర : ముష్టిబిగించి యంగుష్ఠమును నిలువుగా సాచిన రూపొందుతుంది.

ముకుళ : హంసముఖ ముద్రయందలి వ్రేళులన్నియు చివరలు కలిసినవై దగ్గరగా చేరి ఊర్ధ్వముఖములై యుంచిన నేర్పడుతుంది.

పద్మకోశ : అన్ని వ్రేళ్ళను విడివిడిగా చాచి చివరలు కలియకుండా వంచి అరచేతిని పల్లము చేసినట్లైతే వికసిత పద్మకోశ మనబడుతుంది. వ్రేళ్ళు వంగియుండి పద్మంలోని రేకుల్లాఉంటె నెలతపూలుబూసి కదలి యాడులతవలె కనబడుతూ ఉందని చెప్పడమైంది.

20. బేసరికమ్మలు తీసినట్టులె వ్రేళ్ళ

నొయ్యారముగఁ జీల లొలిచిపెట్టు

బరిటయంచును బంటఁ గఱచి యద్దానిచా

టున రైక విడిచినట్టులు నటించు

ముక్కుంజెవుల వ్రేళ్ళ మూసి నీటమునింగి

స్నానమ్మొనర్చెడి సరణిఁ దెల్పు

నవతార దశకమ్మునఱచేతిలో నాట్య

మాడించు శివపూజ లభినయించుఁ

ఇది స్నానభావాన్ని తెల్పే పద్యం-స్నానానికి ముందు ముక్కుపుడక చెవిదుద్దులు తీసియుంచడం స్త్రీలకు పరిపాటి. భుజముపైనుండే పయటయంచులలో పై యంచును పంటితో కరచి కొంగు తెరచాటు చేసికొని రవిక విడిచినట్లు నటించడం స్త్రీ సహజం. రెండు అంగుష్ఠాలతో రెండు చెవి రంధ్రాల మూసివేసి రెండు కనిష్ఠకలతో నాసారంధ్రాలు మూసి నీటమునిగినట్లు తలవంచి లేపుచుండుట స్నానాచరణాన్ని తెలుపుతుంది. అర్ఘ్యపాద్యాది షోడశోపచారాలచే శివపూజ లభినయించడం పూజాచరణాన్ని తెలియజేస్తుంది.

21. తానమాడుచున్న తటి చెల్వుఁ డరుదెంచి
చెట్టునెక్కి కాంచు గుట్టుదెలిసి
నగుచు నత్తవచ్చె దిగుమంచు జిగిమించు
కళుకుఁజూపుతోనె గదమివైచు.

స్నానసమయాన ప్రియుడు తనను చూస్తున్నాడని తెలిసి అత్త వచ్చెనని బెదరించి సాగనంపుట స్త్రీ సహజమైన లజ్జను తెలుపుతుంది.

పూలఁగోయుచు నొడిఁజేర్చి
మాలగూర్చి సరి నొనర్ప దారము పంట గఱచికొనుచు
సిగనిడిన సూదిదారమ్ము
స్మృతికిరాక కుంచిత భ్రూలతలఁ దల గోకికొనును.

ఎడమచేత పైటక్రింది యంచును కొంత పైకెత్తి యొడిగా మలచుకొని కుడిచేతి తర్జనీ మరియు అంగుష్ఠముల కొసల జతపరచి అగ్రసందంశ ముద్రనుబూని పూలుగోయుట అట్లే ఒడిలోనుంచి ఒక్కొక పూవును దీసినట్లు నటించి అదే సందంశముద్రతో పూలుగ్రుచ్చు చున్నట్లున్నట్లున్న మాలాకారిత్వమును నెరపుటలైతుంది. సూదిని సిగలోచెక్కి మరచినట్లు నటించుచు వెదకుచు తలగోకికొనుట నటింపు ఊర్ణనాభముద్రతో సూచించవలెను.

అరాల హస్తమునందలి తర్జన్యంగుష్ఠాలు సందష్టములగుట అనగా ఒండొంటిని తాకిన, అరచేయిని కొంచెము పల్లముగా జేసిన సందంశ హస్తమనబడును. అరాలముద్రలో అంగుష్ఠము తర్జనియును ఒండొంటితో కలియకుండ మడచిన తక్కిన వ్రేళ్లు చాచియుంచిన అరాల హస్తమగును. ఊర్ణనాభము పద్మకోశ హస్తాంగుళుల అన్నింటిని అరచేతిలోనికి వంచినచో నేర్పడును.

22. పూవుదీవియపైఁ బ్రాకు భుజగు లనఁగఁ
గుడిభుజమునుండి కటి వ్రేలు కురుల నొడిచి
చూపు లోరఁద్రిప్పుచు జడచుంచులల్లు
మ్రోద్పుకన్గవన్ బ్రణయమ్ము మొగ్గదొడఁగ.

భుజమున పూదీవపై ప్రాకు నలద్రాచువలెనున్న కురులచూపు లోరద్రిప్పి జెడచుంచులల్లుకొనుట-అలంకారాన్ని తెలుపుతుంది. ఉత్ప్రేక్షాలంకారాన్ని కూడా చెబుతుంది.

23. అద్దమున రాల్చు గుంకుమ
ముద్దుగఁ దిలకము సవర్చి మురియును గనులన్
దిద్దిన కాటుక వ్రేల్ తల
రుద్దును గురులొరయ నీటు రూపొందు కయిన్.

అద్దముపై కుంకుమరాల్చి తిలకము ఫాల ఫలకమున దిద్దుకొంటుంది. తర్జనిని మడచి కన్నులలో కాటుక దిద్దుకొన్నట్లు నటించి అదే వ్రేలు తలకు రుద్దుకోవడం స్త్రీ సహజం. ఇది స్వభావోక్తి. ఇట్లు అలంకారము చేసికొంది.

24. ఒలుకు శ్రీగంధ మఱచేత నూర్చుకొనుట
అందముగ నీనెలను దీసి యాకుమడఁచు
భావముల హస్తవిన్యాస ఫణితిఁ జూపి
యచ్చెరువు గూర్చు గతుల నాట్యమ్ముసలిపె

ఈ పద్యములో చందనాదికము తీసి యలంకరించుకొని తాంబూల వీటికను సిద్ధపరచుకొని చర్వణం చేయడం అలంకార విభాగములోనిదే.

25. సంయుతాసంయుతములగు సరసముద్ర లందు
సౌందర్యజగతి రూపందుచుండ
హస్తపాదవిన్యాసాల హావభావ
ప్రకటనలఁ జూచి ప్రజ చిత్ర పటములైరి.

సంయుతాసంయుత ముద్రలలో అసంయుత ముద్రలగూర్చి 19వ పద్యంలో వివరించడమైనది. ఇక సంయుత ముద్రలుగూడ ఇందు ప్రయుక్తాలైనవి. హస్తవిన్యాసములీ సంయుతాసంయుత ముద్రలే అనాల్సినవి. పాద విన్యాసాలు మాత్రం చారీమండల భ్రమణవిశేషములు. ఇవి ముందు తెలియబరచడం జరుగుతుంది.

**ఉత్కళిక (ద్విరదగతి రగడ)**

26. జాలెవిడు బొంగరము లీల గిఱ్ఱునఁ దిరుగుఁ
బూలబంతిం బోలెఁ దేలాడు నొక పరుగు

హస్తవిన్యాసాలు పాదవిన్యాసాల కనుగుణ్యంగా ఉండి కొన్ని తౌర్యత్రి కాది భ్రమణాలు జరుగుతాయి. ఇందు ముందు మృదంగజతి పలుకుతూ తదను గుణ్యంగా ఈ భ్రమణాలు ప్రయోగింపబడుతాయి. ఎప్పుడు కుడిచేయి కుడి కాలును ఎడమచేయి ఎడమకాలును అనుసరిస్తూ ఉండాలె. హస్తవిన్యాసాలలో హస్తాలు క్రిందినుండి తలపై కెత్తుట - అట్లే తలపైనుండి క్రిందికి దించుట-కుడి ప్రక్కకు విసరుట-ఎడమప్రక్కకు విసరుట-గుండ్రముగా తిరుగుట అనేవి.

ఇందు ఆకాశ భ్రమరవిధానమనుసరింపబడుతుంది. గాలిలోకి ఎగిరి కాళ్లు ఎడంగా ఉంచి శరీరమును గుండ్రముగా త్రిప్పుట- ఆకాశ భ్రమరవిధానము, భౌమీ-ఆకాశగీ అనే ద్వివిధచారులను ప్రయోగించవలె.

లాలించు పూలయూయేల చేరుల లాగు
నోలిముందును వెనుక కొయ్యారముగు తూఁగు
నటునిటున్ విసరు ముత్యాల వీవనఁబోలి
యటుసోలి యిటువ్రాలి యందాల నడఁదేలి
యలడోలికలఁ దేలు కల హంసగతి నేలి
మలకలగు నాగుకోమలి సొంపునడఁ గ్రాలి.

**మరాళగతి**- రెండు చేతులందు త్రిపతాకములుపట్టి కాళ్లను ఒక దాని తరువాత ఒకటి అర అడుగు దూరంలోవేస్తు యిరుప్రక్కలకు వంగుతూ నడవ వలెను.

**సర్పగతి**-త్రిపతాకములు రెండు చేతులతో నిరుపార్శ్వములయందు బట్టి తొందరగా నడువవలెను. సర్పశిరోహస్తాలు అభినయించవచ్చు. రెండు కాళ్ళ పెనవేసి నిలిచి నాగబంధ భంగిమలనూ అభినయించవచ్చు.

చిలిపియందెలు మ్రోఁగవలయంపు గతిసాగఁ
బులకించి తనువెల్లఁ బూలబంతిగ రేగ

త్రిపతాకలు రెండు చేతులలో యిఉపార్శ్వములయందు పట్టి తొందరగా నడచుటతో చక్రభ్రమణ మేర్పడుతుంది. ఉత్సవగతితో అనగా అలగ, కర్తరి, అశ్వ, మొట్టిత, క్రివల్గ అనే ఉత్ప్లవభేదాలతో గాలిలో చెండువలె నెగిరి నర్తకి యలరిస్తుంది.

జోడుగన్గొని కుల్కి యాడు పారావతము
క్రీడాగతికి నడుగుజాడ లిడ స్వాగతము.

ఇచట–కపోతముద్ర నభినయించాలి. అంజలి అనే సంయుత ముద్రను (నమస్కార ముద్రను) కొంత వ్రేళ్ళ సడలించి పట్టిన కపోతముద్ర యేర్పడును. మరాళగతితో దీని నభినయించవచ్చు.

పాడు నాగస్వర ప్రస్తారమున నూఁగి
యాడు నొయ్యారంపు కోడెనాగన సాగి
వెస నిల్చి ఫణమెత్తి విప్పియాడెడి రంగు
కసుబస్సులం గసరి కాటువేయు తెఱంగు

సర్పత్రాసిత చారులతో సర్పగతితో నాగబంధ భంగిమలతో సర్పశిరోహస్తా ప్రయోగించుతూ నాట్యం చేయాలె.

"పాలేఱు లుప్పొంగి పాయవేసిన లీలఁ
ప్రాకులాడుచు మ్రోలఁ బరువులెత్తిన హేల
గిరుల దొరలుచు దూఁకి తరుల నొరసిన కరణి
వడులు బేనుచుఁ బ్రాకి సుడులుదిరిగిన సరణి"

ఇచ్చుట గంగావతరణము, భ్రాంత, నికుంచితాది కరణుల గొని యభినయించు లొప్పును.

గంగావతరణమందు ప్రక్కలకు నావవలె దేహమునువంచి చెంగలించుట ప్రవాహమువలె దేహమును కదలించుట–తరంగితములైనట్లు పదవిన్యాసము చేయ నొక నదీగతిని పోలియుంటుందీ యభినయం.

మదమరాళము భాతి మత్తేభముల రీతిఁ
గాదమహంసల జాతి కదము ద్రొక్కు కపోతి,
తకధిమిత తకఝుణుత తకఝుంత ఝంతరిత
తకిట జతి ప్రకటగతి నొకటొకటి జతపఱచి

ఇందు మరాళగతితో గూడి మత్తేభగతి, అశ్వగతి ప్రయోగించి నాట్యం చేయాలి.

**మత్తేభగతి** : రెండు చేతులతో ఇరుపార్శ్వములయందు పతాకములు పట్టి సమ పాదములతో ఏనుగువలె నొయ్యారముగా ఠీవిగా మెల్లగా నడువ వలెను. అశ్వగతిలో గూడ నర్తించవలసి యుంటుంది.

**అశ్వగతి:** కుడికాలు నెత్తి తొందరగా గాలిలోనికి ఎగిరి ఎడమచేత శిఖరము కుడిచేత పతాకముద్ర పట్టవలెను.

భోగిని మదమరాళము ఒయ్యారంగా నడచినట్లు మత్తేభము ఠీవిగా సంచరించునట్లు జవనాశ్వము కదముద్రొక్కుతు గమనం చేసినట్లు బహువిధ గతులతో నృత్యం చేసింది. నాట్యం సలిపింది. తకధిమిత, తక ఝుణుత, తకఝుం, తకిట, అనే జతిప్రకట పరచి ఆ జతిని పదముల వృత్తంతో పలికించింది. ఆ జతితో పదగతి కాలిమువ్వల శ్రుతి ప్రకటగతి నొకటొకటి జతపరచి ప్రేక్షకుల ముగ్ధులచేసింది.

కలికి మెయి దండ చెయి కదలికల వంపులవి
నలువైన నాగుగున్నల నడలసొంపులయి
కేలుదమ్ముల గరుచ్ఛాలనమ్ము లెసంగ
నేలపై రివ్వుమని వ్రాలు హంసి యనంగ
ఆలీఢగతి నేల నాని కూర్చొని నాతి
కేల జువ్వునవంగి వ్రాలి మారుని చేతి
యుండీల చువ్వయై యూగాడ నెన్నడుము
కాండ మిడునట్టు లాకర్ణాంత మిడుకరము

ఆకాశవీధిలో స్వేచ్ఛావిహారం చేసే గరుత్మంతుని రెక్కల్లా కరతలాలను ఒయ్యారంగా కదలిస్తూ క్రమంగా పైకిలేపి అలాగే అభినయిస్తూ ఆ హస్తముల క్రిందికి వ్రాలుతున్నట్లు దింపుతూ రివ్వున రాజహంసి వ్రాలినట్లు వ్రాలి చూపింది.

ఆలీఢగతితో నిల్చింది, అనంగుని రతీదేవివలె (ఆలీఢగతిలో ఎడమ కాలును కుడికాలుకు ముందు ఒకటిన్నర యడుగు దూరములో నుంచి ఎడమ చేతితో శిఖరముద్ర కుడిచేతితో కటకాముఖ ముద్రను పట్టవల్సి ఉంటుంది) మారుని చేతిలోని యుండీల చువ్వలా నడుము ముందుకు వెనుకకూ అసియాడింది. "ఇరుకుగుబ్బల బరువు నడుమును ఎంతో ముందుకు వంచివేయగా జఘనభారము గౌనుదీవెను సగము వెన్కకు గొంచుబోవగా, యిరువైపులా ఉండు కడవల బరువులకు నిటునటును వంగుచు జువుజువని వడకాడు కావడి చువ్వలా అసియాడిందా భోగిని నడుము. ఆలీఢపదమూని యలరువిల్తుడు ఆకర్ణాంతం సుమశరాల గురిచేసి వేసి శ్రమ పెడ్తున్నాడని తన దయనీయ స్థితి నృపతికి తెలియజేసింది, విలవిలలాడిపోతూ వీరగతితో".

"వెనుద్రాలి తనకాలి పెనుద్రేలి స్పృశియించి
మును వ్రాలి రతిపతికి మ్రొక్కి శిరమును వంచి"

కటి, భ్రాంతమను కరణముచే నడుమాడించి చక్రమండలము అనే కరణముచే నిలబడి పాదములానించి మొగ్గవ్రాలినట్లు వెనుకకు వ్రాలి చేతులానించక చక్రముగా దేహమును త్రిప్పుతూ వెనుకనుండి తన కాలి బొటన వ్రేలిని తాకి లేచి నికుంచితము, అనే కరణముతో దేహమును ముందుకువంచి జానువులు వంచక శిరసు నేలనానించి అంజలి ముద్రతో రతిపతిరూపుడగు సింగభూపాలునకు నమస్కరించి శరణాగతి చేసింది.

విడిన పయ్యెద కొసలు పిఱుచుట్టురాఁ జెక్కి
సడలు మువ్వల పేరు లెడనెడను ముడి నొక్కి
యడలు చిఱుచెమ్మటల గడెగడెకు తడినద్ధి
వడిఁ జిక్కువడు సరము లొడుపుగా సరిదిద్ధి

నృత్త నాట్యాలవలన చెదరిపోయిన ఆహార్యం చక్కదిద్దుకొనడం చూపబడింది. పయ్యెదచెంగు పిఱుచుట్టు వచ్చునట్లు ముందునకు దీసి ఎడమరొండికి గల చీరకట్టులో జెక్కి కాలిగజ్జె లూడిపోవ సరిగా కట్టుకొని, చెమ్మటగ్రమ్మ చేరుమాలుతో ముఖలేపము చెదరకుండా పైపయి నద్ది మెడలో చిక్కువడిన హారాల సరిచేసికొని తిరిగి నృత్యం ప్రారంభించింది. అవియు నాట్యంలో నొక భాగమేమో యన్నంత ఒయ్యారంగా, సరిదిద్దికొన్నది.

గలుఘల్లుమని కాలి గజ్జియలు రవళింపఁ
దెలిచీరయంచు జలతారు ఝరి ప్రవహింపఁ
గురులు కనుదమ్ములన్ బెరసె బంభరములై
కర మొరసె బిగిచనుల్ కంతు బొంగరములై
ఫణులు గగనములోకిఁ బాఱాడెఁ గరములై
మణుల జీవములు పడి పెనఁగె నుంగరములై"

మువ్వల సవ్వడి జవ్వని నవ్వులవలె రవళించింది. నృత్త సమయంలో చీరచెరగంచు జల్తారుమెరపు లీను బంగారు నదీ ప్రవాహమువలె చలిస్తున్నది-కన్నులను కమలాలనుకొని, ముంగురులు భ్రమరాలవలె పైపైబడవస్తూ ఫాల ఫలకాన నాట్యం చేస్తున్నవి. మన్మథుడనే గారడీని చేతిబంగారు బొంగరాలవలె వలుదలైన వక్షోజాలు ఒరసికొని చలిస్తున్నవి. ఆకాశంలోకి ప్రాకిపోయే ఫణులవలె హస్తాలు ఆడుతూంటే వ్రేళ్ళ ఉంగరాలలోని మణులు సజీవములై పెనగులాడు తున్నట్లున్నాయి.

చెలినవ్వు నెలవంక చలువవెన్నెల గాయఁ
గలికి కన్నుల సొగసు కలువపూవులఁ బూయఁ
గులుకు గళరవములోఁ గొసరి కోకిల గూయ
వలరాజు పువ్వు క్రొవ్వాఁడి ముల్కుల నేయ
సలలితాంగుళులన్ రసాలశిఖి పులకింప
నలరు తరుణాంగకము లామనుల తెర దింప

నెలవంక లీను నవ్వుల పువ్వులు చలువవెన్నెలల విరజిమ్మ ఆ కలికి కన్ను కలువలు చిలిపిగా నవ్వినట్లు విప్పారినాయి. నవ్విన పలువరుస నాణ్యమైన మల్లె మొగ్గలుగాగా కన్నుల కలికి చూపులు కలువపూలైపోగా ఈ నవమల్లికల ఈ నీలోత్పలాల మరుని విరితూపుల నొనరించి ధరణీపతి గుండెపై గుప్పివేసింది. గళములోని కలస్వరాలు కోకిలలై జయగీతాల నాలపించాయి. కరాంగుళుల రసాలాలు పల్లవించ యౌవనముతో పువ్వుల నీనెడి అవయవాలు దిగంతాల వసంతాల తెరల దింపినవి. ఇందు రూపకాలంకారము పొందు పరచనైనది.

ఒడల పుత్తడినిగ్గు తడలు మత్తడి దూఁకఁ
బెడఁతి కనుసన్నల న్నడచుఁ జెల్వపువాక

తనువుపై పెనగియాడే పచ్చని పసిండి కాంతిఝురులు కట్టల త్రెంచుకొని కదలి మత్తడిదూకగా సకల సౌందర్య స్వర్ణదులు ఆమె కనుసైగలలో నాడి విధేయములైన అనిపించింది.

*ఆటపాటలలోన నందచందము నించి*
*యలరించి సభకు సభ నాడించి పాడించి*
*మురిపించి మఱపించి కరఁగించి కదలించి*
*మదము నిచ్చుచు నట్టె నిదురబుచ్చుచు మించి*
*లాలి నూపెఁడి శివాలాస్యమ్ములను బోల*
*బాలకృష్ణునిలీల శూలి తాండవ హేల*
*నవ్యమోహినివోలె నాట్యముల వలపించె*
*భవ్యభారతివోలె భరతమ్ము నొనరించె.*

అందచందాలతో ఇట్లా ఆటపాటలు సాగి సభను తలల నాడించాయి; స్తోత్రాల పాడించాయి; రసికులను మురిపించాయి; శరీరాలనే మరపించాయి. మనస్సులన కరగించాయి; చైతన్యాన్నే కదలించాయి. నాట్యం ముదమిచ్చింది–గానం నిదురబుచ్చిం లాలిపాడినట్లు–వీరరౌద్ర బీభత్సాదులలో శివకేశవుల అఖండ తాండవమై, శృంగారాద్భు హాస్యాదులలో, శర్వాణీ జగన్మోహినీ కాంతల లాస్యభాష్యమై 'భేష్' అనిపించింది.

27. *అందము చిందులు ద్రొక్కెను*
*విందగు జవ్వనము భువనవిజయ మొనర్చెన్*
*కుందనమున జీవము వడె*
*చెందామర లురుకులాడె చెలి నృత్యములన్*

అందమునే ఆకారంగా జేసికొని విందైన యౌవనం భువనవిజయం జేసింది. ప్రాణంబడిన బంగారంలా ఆమె పసినిమ్మపండువంటి మేను మెరసి యాడింది. చెలినృత్యాలలో చెందామరలకే కాళ్లువచ్చి కదలి యురుకులాడినవి. ఆమె నాట్య మిట్లనజేసింది. ఇందు ప్రతీపాలంకారము భాసిస్తున్నది.

28. లలిఁ బవడంపు వన్నెల జెలంగు పదమ్ముల రాజహంసికా
చలనవిలాసలాస్యములు సాగక గంగ మునుంగ బిఱ్ఱుగాఁ
గులుకు కపోతయానములు గుట్టలు చెట్టులుఁ బట్టి పాఱఁగా
నలజడి చేసెనా గిలుకుటందెల చిందులతోఁ బసందుగన్॥

పారాణి పదాల నలంకరించుకొని పూవులాంటి తెల్లని చీర ధరించి భారతీ సతిని సేవించి భరతనాట్యాన్ని అభ్యసించి భోగినితో పోటీపడి మొగమెఱ్ఱనై యరుదెంచిన హంసాంగన ఆమె లాస్యానికి సాటిరాలేక అవమానము నొంది మళ్ళీ మనుష్యమాత్రునికి మోము జూపించక చప్పగా గంగలో జారుకున్నది. అంచను మించిన అంగలాఘవం మాకుందని కనులెఱ్ఱజేసిన కపోతియు పువులీను గళంలో నవరత్నహారాలు పొదుగుకొని వచ్చి కనువిచ్చిచూచి ఆమె భరతనాట్య ప్రాభవములో ప్రసంగానికైనా పనికిరాక అభిమానం చచ్చి అరణ్యాల జొచ్చి చెట్లుగుట్టలు పట్టి పారిపోయింది. ఇందులో హేతూత్ప్రేక్షాలంకార ముద్ర కనబడుతుంది.

29. పవన డోలికల జంపాల లూఁగుచు సర
స్తటి నాడు కెరటాల సొరుదోఁచుఁ
గదము ద్రొక్కెడి మారు గజ్జెల గుల్లమై
యాటలాడెడు బెడం గడర నొకట
నద్ద మద్దముద్రిప్ప నసియాడు బాలార్క
కిరణంపుఁ దళుకుల సరణి బెళ్క
దంపతుల్ తమ ప్రణయంపుక్రీడలఁ జేత
నెగిరించు పూబంతి సొగసు లొలయఁ

గాళ్ళె నాట్యమాడుఁ గదలదు పై మేను
యెముక లేనియట్టు లెచటి కచటఁ
గలువకాఁడలట్లు కాళ్ళు చేతులు వ్రేళ్ళు
మెదయు నడుము వింతయొడుపు మడఁగు

ఒక మారు మలయమారుత డోలికలలో సరోవరతీరాన నాట్యమాడుకొనే కెరటాలలా ముందు వెనుకాడి మురువుగొల్పుతుంది. మరొక తేప కందర్పసుందరుని గజ్జెల గుల్లంవలె

కనువిందుగా కదంద్రొక్కుతుంది. ఇంకొక తడవ అర్కుని కిరణాలకు అడ్డంగా అద్దంపట్టితే పలువన్నెలతో ప్రక్కనున్న గోడపై ప్రతిబింబించి ప్రకాశించి తళతళలాడే ఇంద్రధనుస్సువలె కనబడి ఎండపొడలాగా నృత్యం చేస్తుంది. దంపతుల ప్రణయక్రీడలోని పూబంతిలా గంతులువేస్తూ గగనంలోనే గమనం చేస్తూ ఉంటుంది. కాళ్లు మాత్రమే నాట్యంచేస్తుంటాయి. కడమ పై శరీరం కాసంతైనా కదలనే కదలదు. ఒకసారి ఎముక లేమాత్రం లేవా అన్నట్లు కలువకాడలవలె కాళ్లుచేతులు నడుము మెడ ఎంత హొయలుగా ఎటువంచితే అటే వింతగా మడగుతాయి. ఇందు నాట్యవ్యాయామంతో వచ్చిన దేహస్వాధీనతను చెప్పడమైంది. పైదంతా ఆమె నృత్యంలోని త్వరితగతులను విశదంచేస్తుంది.

*30.* కొంకు మార్దంగికుని వైణికుని కరాల
వ్రేళ్ళు నిరువదింటిని నిరుగాళ్ళతోనె
విషమములగుజాతుల మార్చి వివిధతాళ
కాలగతి తీవ్రతలఁ ద్రుటిన్ గట్టివైచు.

మొదలే ఆమె నృత్యధాటికి తట్టుకొనగలనా అని సందేహించు మార్దంగికుని మరియు వైణికుని ఇరువది వ్రేళ్ల గతులను ఇరుగాళ్లతో చరించు చారులతో విషమగతులతో-అంటే తాళానికి ఎదురుగా నడవడం. అక్షరం అర్ధాక్షరం కాలం విడిచి గతియెత్తుకొని ఎచ్చట గతిముగిసి ముక్తాయి తెంపుతుందో తెలియనీక-లయజ్ఞాన పాండిత్యాన్ని ప్రదర్శించి, ప్రశంసల వర్షంలో తడిసిపోతుంది. ఒక జతిని మార్దంగుకుని ఇరువది వ్రేళ్లు వాద్యంచేస్తే నర్తకి యొక్క రెండు కాళ్లు మాత్రమే అక్షరం పోకుండా ఆ జతినంత నర్తించి చూపుతుం దనడం నృత్త విశేషం జాతి-చతురశ్రలయ ప్రస్తారము.

*31.* త-తో-హో-ధి-మ్మి-త్త-ధిం-ద-త-తో-హో-ధి-మ్మి-త్త-ధిం-దా
ధిత్తా-ధిమితా-కిటతక-తళంగు-తకధిమి-తక దధిగిణతోం
తత్తధిమిత-ద్ధిమితద్ధికితక-తై తాకిటతక-త తెహితతోం-
తై తాకిటతకత తెహితతోం-తేక్ ధినకిటతకిధీన గినధాగినధా కిటతక.

**ముక్తాయి-సంకీర్ణ**

తకఝుం-తతఝుణ-తరికిణకిటతక-తరికిట కిటతకధా-
తరికిటకిటతకధా-తరికిటకిటతకధా.

## ముక్తాయి-ఖండగతి

32. తఝ్ఝమ్-తక ఝుం-తరితఝుం-×-తధిగిణత-తధిగిణత-తధిగిణత-

## త్రిశ్రజాతి మార్పు

ధాగినధిగినత్రకిట ధాతధా త్రుకతకిట తక ధాతధా-త్రుక తకిటతకధాతధా

## రెండవకాలం ముక్తాయి

త్రుకతకిట తకధాత ధా కిటతక-గదిగనధా-కిటతకగదిగనధా-కిటతకగదిగనధా

## ఐదుజాతుల ముక్తాయి

తకఝుణ-కిటతక దధిగిణత-తక దధిగిణత-తధిగిణత-

ధిగిణత-గిణత-త-తో-హో-ధి-మ్మి-త్తధిం-ద-

## తొహర

ముక్తాయిలఁగొని మృదంగనాదము ముమ్మాఱుల్ వడి మ్రోఁగెన్
సక్తాత్మకమై సభాసముద్రము స్మయవీచికలన్ దూఁగెన్
కాళ్ళగజ్జియలు ఘలుఘలుఘలుమని కర్ణామృతములఁ బోసెన్
జోళ్ళతాళముల పలపలపలధ్వని చూపఱఁ జకితులఁ జేసెన్
చేతికంకణాల్ గినగినగినమని చేతములకు వలవేసెన్
నాతి యందియల్ చనచనచనమని గీతములకు శ్రుతిబోసెన్
స్వర్ణ మేఖలా కింకిణీక్వణిత ఝణఝుణంకృతి బాడెన్
కర్ణపత్ర మణిమౌక్తికాభ్రమణ కాంతి తళ త్తళలాడెన్
కనకరత్న వరతారహారముల కాంతు లూయెలల నూఁగెన్
ఘనతర నాసామౌక్తిక ప్రభల ఖద్యోతమ్ములు రేఁగెన్
వ్రేళ్ళ నమరు రత్నాంగుళీయరుచి వీచుల సింగిణు లూరెన్
గోళ్ళవెల్గు సితకాంతిపుంజముల క్షోణిని దారలు జాఱెన్.

మృదంగజతి నాదములో తుదకు ముమ్మారులు ముక్తాయి మ్రోగింది. సభాసముద్ర ముప్పొంగి ఆశ్చర్య తరంగాలలో తేలియాడింది. వీనులవిందుగా వినిన కాలియందెల సందడి చెవులలో గింగురుమని మ్రోగుతూనే ఉంది. తాళముల నినాదాలు కని

చకితులౌతున్నారు. బంగారు మొల నూలి మువ్వల సవ్వడి ఝుణం ఝుణలతో మ్రోగుతూనే ఉంది. కర్ణపత్రాల మణి మౌక్తిక కాంతులు తళ తళ లాడుతూ మెరుస్తున్నాయి. గళంలో ముత్తైవసరుల ప్రభలు ఊయెలలూగుతూనే ఉన్నవి. నాసామణి కాంతులతో ఖద్యోతాలు (మిణుగురు పురుగులు) విజృంభిస్తున్నట్లున్నది. రంగు రంగుల రత్నాంగుళీయ కాంతులు సింగిడీల చిత్రిస్తూనే ఉన్నవి. హస్త విన్యాసాలలో నఖముల శోభలు మహీమండలంపై చుక్కలు జారుతున్నట్లున్నవి. ఆమె నృత్తమింత యందంగా సాగుచున్నది.

**రగడ: "మంగళమహాశ్రీ" వృత్తమాలా(అనుకృతి)**

33. ద్యోతలమునం దెగయు శ్వేతాభ్రమై
మదను కేతనమ్మై యెగయుఁ గొంగు
పింజలై కెంజాయ సంజలై కెంజివురు
మంజరులఁ జిమ్మెడి చెఱంగు
జంభారిపై గినిసి యంబరము దిగివచ్చు
రంభఁ దలపించు రూపమ్ము
కరఁగి యుఱుకాడు బంగరు తేటినీటి
నిర్ఝరి నేలు మేని వర్ణమ్ము
హాసమై చాంద్రీవికాసమై వికచసుమ
భాసమై యొప్పు నగు మొగము
వీఁకమై కజ్జలిత లోకనమ్ముల నెరతి
లేఖ లల్లెడి నయనయుగము
మూటయై వలరాజు తోటయై సోయగపుఁ
గోటయై యొప్పు యౌవనము
కమ్మనై మదనమంత్రమ్మైయై
యింద్రజాల మ్మొలయు మధురభాషణము
సొమ్ములై ప్రణయ సూత్రమ్ములై
మరునాటబొమ్మలై నటియించు బొమలు
ముచ్చులై సభ కనుల నుచ్చులై

నునుపట్టు కుచ్చులై చెదురు భ్రమరములు
మూకలై మిన్నేటివాఁకలై
రాయంచ రాకలౌ కోకకుచ్చెళ్ళు
నురువులను దరఁగలటు సరములౌ
ముత్యాల నొరయుచుండిన యుదరవళులు
వేణువై నినదించు వీణయై
వీణగొను వాణియై చిలుకు గానమ్ము
సంగీతసాహిత్య సౌందర్య సౌభాగ్య
సకలమ్ము నామెదే సొమ్ము.

ఆమె కట్టిన తెలి పట్టుపుట్టపు పైట కొంగు ఆకాశకీచారుల నభినయించునపుడు దివిలో నాడు మదన విజయ ధ్వజంలా రెపరెపలాడుతూ ఉన్నది. ఆ చీర చెంగావి యంచులు పింజలు పింజలై సంధ్యారుణదిగంతాల తొగఁబు చిగురు వసంతాల చిత్రిస్తూ ఉండగా నగ భేదితో జగడమాడి దివినుండి అవతరించు అప్సరసయైన రంభవలె నవనిపై వివిధ నృత్యాలు చేస్తూ వెలుగు తున్నది. పసిడి కరఁగి పోసిన వాకయై పచ్చని యాయచ్చర మైకాంతి పరిపరివిధాల మెరపువలె సాగిపోతున్నది. ఆమె పెదవులపైనదిహాసమో, వెన్నెలవికాసమో మల్లెపూల విలాసమో అన్నట్లున్నది. కాటుక కన్నుల నీటగుచూపులు ప్రేమ లేఖలు వ్రాస్తున్నట్లున్నవి. ఆమె పచ్చని శరీరము ప్రేమ ధనపు మూటవలెనుంది. తీవవంటి మేనుతో నవ్వుల పువ్వులతో పాలిండ్ల ఫలాలతో కరపద శాఖలతో నొప్పారు వలరాజు తోటవలె నుంది. సౌందర్య సామ్రాజ్య రక్షణకు కోటవలె నుంది. మదనుడూదు మంత్రమో ఇంద్రజాల తంత్రమో అన్నట్లు ఆమె మాటలు చూపులు ఆకర్షిస్తున్నవి.

బొమ్మలు మరుని ఆటబొమ్మలై నటిస్తున్నవి. ప్రణయసూత్రమ్ములట్లు ప్రేమభాష్యాల తమలో దాచుకొన్నవి. సభానేత్ర మీనముల నాకర్షించు వలలో అన్నట్లు పట్టుకుచ్చులవంటి శిరోజాలు చీకటిలోని దొంగలవలె చెదరి పోతున్నాయి. ఆకాశమునుందరుదేరు రాజ మరాళములో లేక స్వర్ణదీ ప్రవాహములో యన్నట్లు కోకకుచ్చెళ్ళు తెల్లగా రెపరెపలాడుతున్నాయి. ఉదరవళులు తనురుచి కాంచన నదీప్రవాహములోని తరగలుగాగ వానిపై నాడు ముత్యాలపేటలు నురువులవలె శోభాయమానముగా నున్నాయి. ఈమె కంఠనాదము వేణువా కాదు వేణువునకు తుంబీఫలము తలగా నుండునా? వీణగానోపు.

వీణ నాదగానమే చేయునుగాని అందు భాష యుండునా? కాదు. వీణ గొని పాడు వాణి యేమో అనినట్లు కమ్మనిగానము వినిపిస్తున్నది. వే యేల? ఇంతకూ సంగీతం సాహిత్యం సౌందర్యం సౌభాగ్యం సకలము ఆమె సొమ్మే ఐపోయినాయి. ఎవరికీ ఏమీ మిగల్చలేదు.

34. కలమధురార్ద్ర శైత్యసిత కాంతులనంతము లీను నేత్రపుం
గలువ, కనీనికా భ్రమరకాముకుఁ డాత్రమునన్ బయింబడన్
గలియ నఁటంచు సిగ్గునునుగాడ్పుల మున్వెనుకాడ నడ్డమై
నిలువు స్వమోహసంతమసనిర్భరహస్తము లౌచు బక్ష్మముల్॥

తెలియజెప్ప రానంత మనోజ్ఞంగా ఆర్ద్రంగా చల్లగా తెల్లగా వింత కాంతుల ప్రసరించు నేత్రమనే కలువకామినిపై కనీనిక (నల్లగ్రుడ్డు) యనబడు భ్రమరకామకుడు కామాతురుడై పైనబడినాడు. నేను నీతో కలియ నటంచు లజ్జాపరవశయై యామె మోమును వెనుకాడి పారిపోజూచింది. కాని తన మోహాంధకార స్వరూపమునకు ప్రశస్తహస్తము లనబడే కంటిరెప్పలు అడ్డమై యాపివేసినాయి. లేకున్న పారిపోయేదేమో? లజ్జ ఎంత ఎడగా నుంచాలని కృషిసల్పినా అంతరాళాల్లో ఉండే ప్రేమ వ్యామోహము మెత్తబరచి పతికి స్వాధీనురాలయ్యేటట్లు చేస్తుందనడానికి నేత్రోత్పలమే నిదర్శనమై చూపట్టింది.

35. నాతి మోమున నాట్యమ్మొనర్చు కనుల
మదనవిజయధ్వజం బెత్తు మత్స్య యుగళి
రమ్య నవరసభావతరంగఝురుల
బెడిసి యాడెడి వజ్రాలు మిడిసిపడఁగ.

భోగినిమోమునందు సిగ్గుచే చిందులు ద్రొక్కు చంచలనేత్రాలతో మీన మిధునము మదన విజయధ్వజ మెత్తుచు నవరస తరంగాలలో నాట్యంచేస్తుంటే పర్వతంలాంటి ఉర్వీపతి గుండెధైర్యంపై వజ్రాయుధాలువడి, భేదిస్తున్నట్లున్నది. అందుకే ఆ కనులు వజ్రాలవలె మిడిసిపడుతున్నాయని పోల్చనైనది. ఆమె లజ్జాపరవశయైనది. ఆయన మోహపరవశుడై గుండెనిబ్బరము కోల్పోతున్నాడు.

36. అరమోడ్పు కన్గవన్ బరవశత్వము జూపు
కలికి క్రేఁగన్నుల కాంక్షదెలుపు

రస భావాలు దృష్టులతోనే ప్రదర్శింపబడటం సహజం-దృష్టులలోనే నాట్యము ప్రతిష్ఠితమైయుంది. నానాభావ రసాశ్రయమైన దృష్టి యొక్క లక్షణాలు ఆ రసభావ విభేదాల ననుసరించి అనేక విధాలుగా ఉంటాయి. నాట్య శాస్త్రరీత్యా ముఖ్యంగా రసదృష్టి భేదాలు 36. ఇవి సాత్త్విక భావ సంచారీ భావ స్థాయీభావాల ననుసరించి రూపొందుతాయి. పై పద్యంలో అవి కొన్ని వివరించడానికి ప్రయత్నం జరిగింది. అరమోడ్పు కన్నులతో పరవశత సూచించుచు క్రీగంటి చూపులతో కాంక్ష అనగా మన్మథ భావమును వెల్లడి చేయడం శృంగార రసంలో ప్రయుక్తమగు "కాంతదృష్టి" అనబడుతుంది. క్రేగన్నులగుట ప్రక్క చూపులు జూచుట తారక కంటి చివరి వరకు పోవుట తారాకర్మలలో వివర్తన మనబడుతుంది.

ఆ లోల భీత ముగ్ధాలోకనమ్ముల
శృంగారలజ్జలఁ జిల్కరించు

సిగ్గుచే జారిన రెప్పల చంచలములైన బెదరుచూపుల అధోగతములైన తారకలు గల్గిన చూపు సంచారీదృష్టి భేదాలలోని లజ్జాన్వితదృష్టి అనబడుతుంది. పక్ష్మములిందు కొంచెము వ్రాల్పబడి యుంటాయి.

సుడిగొన్న బొమముడిన్ జుఱజుఱ చూచుచుఁ
బ్రణయకోప భరమ్ము ప్రకటపఱచు

ఇది క్రుద్ధ దృష్టి కుటిలమైన బొమముడి కలిగినదై కనురెప్పలను తారకలను నిశ్చలముగా ఉంచి పరుషముగా నుండు చూపు స్థాయీభావ దృష్టులలోని క్రుద్ధదృష్టి యనబడుతుంది.

వాలుఁ గన్ను లొకింతఁ దేలవైచిన చూపు
మనలేని విరహవేదనముఁ జెప్పు

ఇది పాతనదృష్టి. కంటి తారకలు దిగజారినట్లు వదులుగా ఉండుట వేదనా సూచకము లగుట పాతన మనబడు తారాకర్మ.

మూయుగనుదమ్ములన్ ధ్యాన ముద్ర గదుర

ఇది విహితమనే నే(త్ర పుటకర్మ. ఇందు రెప్పలను దగ్గరగా జేర్చి కనులు మూసియుండును. ఇది సుప్త–ధ్యాన–మూర్ఛితములందు (ప్రయుక్తము ఔతుంది.

నగు కనులఁ బియదర్శనానంద మెదుగ

లలితదృష్టి ముడుచుకొనుచున్న కనుకొనలు ఎగురవేయుచున్న కనుబొమలు గలదై మధురము, సస్మితము మన్మథ వికారోపేతము అగు చూపుల లలితదృష్టి అనబడుతుంది. ఈ రీతి యానాతి నవరసభరితములైన సుందరదృష్టి భేదములచే శృంగారము (ప్రధాన రసంగా కావ్యలేఖనం చేసింది.

నాతి నవరసభరితసౌందర్యఫణితిఁ
గంటిచూపుల కావ్యలేఖన మొనర్చె

రసాత్మకం కావ్య మవడంవల్ల రసాలు నే(త్రాలలోనే దర్శితాలగుట చేత కంటి చూపుల కావ్యం (వాసి సింగ భూపాలునకు ఆత్మాంకింతం చేసుకొన్నది. రస సూచకమైన నే(త్రాభినయం సాత్వికాభినయమై యుత్తమోత్తమ స్థానాన్ని గడిస్తుంది.

37. కమ్మనివిలుకాని యమ్ము లబ్జమ్ము లెందు
తమ్ము లనబడు కల్కి నే(త్రమ్ములకును
మగువ వదనసౌందర్య రమాసమార్త
నియతి మాసమ్మునకుఁ దూగి నెలయగు శశి.

కమలాలను తెనుగులో తమ్ములంటారు. బహుశా ఈ భోగినీ విశాలాక్షులకంటె చిన్నవై పోవడం వల్లనో ఈ పద్మాలు ఆ కన్నులకు తమ్ములనబడినాయి. శ్లేషచేతనైనా వక్రోక్తిచేతనైన అర్థాంతరము కల్పించిన యెడల వక్రోక్త్యలంకారమౌతుంది. పై పద్య పాదాలలో ఆ యలంకారము భాసిస్తుంది. చంద్రుడు తా నీ యందగత్తె ముఖానికి సాటి రావడానికి ఒక నెలరోజులు పట్టింది. అంటే పున్నమికిగాని చంద్రుడు పూర్ణుడై ముఖాకారం పొందడు. అందుకే వానిని నెల యన్నారని భావం. ఇది న్యూనతాద్రూప్య రూపకాలంకారము. ఉపమేయం కంటె, ఉపమానంలో న్యూనత ఉండడంమూలాన తమ్ములు అను శబ్దం ఉండడంచే శ్లేషగూడ దర్శన మిస్తుంది.

38. ధారుణిపైఁ బదాబ్జములు తాఁకుచు నుండెనొ లేదొ యన్నటుల్
నారి ప్రసూనబాణు విలునారిగఁ దారుచు నాట్యమాడెఁ జె
ల్వారెడు పండుటాకు నును జెక్కులఁ జెమ్మటచుక్కలొౘు నొ
ప్పారెను ఫాలభాగమున నద్దిన కస్తురి చుక్క యట్టిటున్
గాఱెను ముంగురుల్ మొగముఁ గప్పుచుఁ విప్పుచుఁబోరెఁజారు శృం
గార రసార్ణవమ్మునఁ జకాపిక చంచలనేత్ర మీనముల్
బాఱె నురోజయుగ్మముల పై మను పయ్యెద హద్దుపద్దులన్
మీఱెను గీల్జడన్ దుఱుము మేదుర సౌరభ సూనహారముల్
జాఱెను మూఁపునన్ బ్రజకు సమ్ముదముల్ సమకూరె మానస
మ్మూఱె నృపాలరాణ్మణికి నుల్లమునందిఁక నామె రూపమే
చేరె క్షణ క్షణమ్మపుడె చేడియఁ గూరిచి చిత్త మెట్టెటో
మాఱెను దెల్పఁజాలమికి మారుని దూఱెను సారెసారెకున్.

క్షోణిపై పాద పద్మాలు సోకుచున్నవా లేదా అన్నట్లు ఆ నారి (భోగిని) పుష్పబాణుని నారి (అల్లెత్రాడు)గా సంచరిస్తూ నృత్యమాచరించే సమయంలో పండుటాకులపై పడియున్న నీటి బిందువులవలె చెక్కులపై చెమ్మటచుక్కలు నిల్చినవి. ఆ ఘర్మ జలాలకు ఆర్ద్రమై ఫాలఫలకముపై నందగించు కస్తూరీ తిలకము కాస్తజారినది. ముంగురులు ముఖపద్మముపై మూగుచు పోరాడుచున్నట్లున్నాయి. వదన శృంగార వార్ధిలో నేత్రమీనాలు చకాపిక చంచలగతుల నాడుచున్నాయి. వక్షోజాలపైగల వలిపెంపు పయ్యెద హద్దులుమీరి జారి యతిచరించింది. క్రేనలిం దురిమిన సూనహారాలు పట్టువీడి ఇట్టట్టు మావులపై జారిపడుతున్నాయి.

పారిషదులకు ఆ నర్తకీ స్వరూపం అప్పట్ల ఆనందదాయకమై యొప్పారింది. భూపతికి యా పూబోడి మోము చెదరి జారిన కస్తూరి తిలకంతో నున్నా చంద్రబింబం మృగాంకంతో నున్నట్లు భాసించింది. చెక్కుల యందలి చెమట చుక్కలు పండుటాకు తాంబూల వీటికలపై యొప్పు లవంగపు మొగ్గలవలె మురిపించాయి. జారు పయటనుండి చక్రవాక మిథునమువలె సాక్షాత్కరించే వక్షోజాలు సరోవరతరంగాల యొరపిడి నుండి బయటబడిన సరోజ షండాల వలె ఆకర్షించాయి రసికశిరోమణియగు రాజేంద్రుని మనసూరించి.

ఆరంభరూపమే మనస్సులో చేరింది. చిత్తము పరి పరి విధాల మారింది. తెల్పరాని ఈ యవస్థ నా కేల గల్పించితి వని పంచశరుని దూరినాడు. మన్మథోపాలంభం.

39. హే కేశవ తవ విరహే
సా కాంతా రాధికా విషణ్ణా యని తా
నాకామిని విరహ(ప్రణ
యాకారము దాల్చి సెజ్జ నారాటపడున్.

తన పై మరులుకొనియున్న భూపాలునిచే తనను పసికట్టింది. నేనును నీకై విరహానల పరిత ప్తనగుచున్నానని తెల్పుటకు "ఓ కేశవరూపుడ వగు సింగభూపాలా! ఈ కాంతరాధిక వలె నీ విరహము భరింపలేకున్నది. పూలసెజ్జయైనా రాల సెజ్జవలె బాధ పెడుతుండగా నిటులుపేక్షింతువేలా"యని సూచ్యంగా రాధికా విరహము నభినయించి వాసకసజ్జికయై వనట నొందింది. స్వస్వరూపమును తెలిసికొన్నాను. వరస్వరూపుడవగు నీవును నావలె కామమునే పురుషార్థ స్వరూపముగా ఉపాసించు చున్నావు. దానికి విరోధి స్వరూపమును గుర్తెరింగి తప్పించు కొనినగాని ఫలవాప్తి గాదని ముందు పద్యంలో వివరిస్తుంది. ఈ పద్యంలో హావ, భావ, హేలా, విలాసాది శృంగార చేష్టలు స్ఫురించడం కద్దు.

40. మోవి నొక్కి కొనుచు మునిపంట బొమముడి
శిరము నూఁపి యెత్తు చిగురు కేల
సడి యొనర్ప కంచు సంజ్ఞ సేయుచుఁ (బక్క
యింట నత్తవదినె యుంట ఁదెలుపు.

"ఓ రసిక శిరోమణీ! నీకును నాపై (ప్రణయ మంకురించి పుష్పించి హృదయ వాసనల వెలిజిమ్ము చున్నది. నాకు మాతయై నీకు అత్తగా నున్న ఈ వేశ్యమాత మరియు నీమెకు (ప్రక్కననుండి మన (ప్రణయానికి భంగము గలిగించే విరోధ భాషల పురికొల్పే ఈ దేవదాసి వరుసకు నాకు అక్కయై నీకు వదినెవలె నున్నది. వీరి యిరువురిని సమాధానపెట్టి సాగనంపిన మన మిరువురము మనసిజకేళి లోలురమై మనవచ్చు. గడబిడ జేయకుండా కాస్త తాళవలసి వస్తుంది"– అని విరోధి స్వరూప నివారణను సూచ్యంగా మనవి చేసింది.

41. అట్టి నేదొ చప్పుడైనట్లు చెవి బెట్టు
నటన సేసి సడి నొనర్పకుండ,
నడచిపోయి 'కృష్ణ నవనీతహర'యని
బుగ్గ నులిమి కసిని బుద్ధిగఱపు

"నా హృదయ మొక గది. అందు నీవు నే నెరుగకుండా ప్రవేశించావు. నా యనురాగ నవనీతాన్ని దొంగలించావు. నన్నిట్లు దొంగిలించింది నీ సుందర ముఖారవిందము, దాన్ని బుగ్గ నులిమి, నా కసిదీరునట్లుగా శిక్షింతును- అని తన ప్రేమాతిశయాన్ని ధ్వనింప జేస్తున్నది."

42. వెన్న దొంగిలించు చిన్నతనపు చేష్ట
మురళిఁ బూని పాడు ముద్దు రూపు
శంఖ చక్రహస్తసర్వేశు వైఖరుల్
దలఁచి విరహ యగుచు దల్లడిల్లు

తన హృదయాన్ని దొంగలించిన హరిత్వము(హరి) సింగపు పర్యాయ పదము తనవంటి చిన్న దాన్నిగూడ చేపట్టునంత యందుబాటులో నుండే సౌలభ్యస్థితి (చిన్నతనపు చేష్ట) మురళివంటి నా యంతరంగములో రాగమును నింపుతనము (రాగము) ప్రేమకు ఊపిరివోసిన దాక్షిణ్యమునో ప్రణయ సామ్రాజ్య చక్రధారిత్వమునా విరోధివరమును రక్షించు నీ యభయవాక్య ప్రధాన శంఖరవము గాంచిన నీవే నా సర్వస్వమునకు ఈశ్వరుడవు. ఇంక నిన్ను విడిచియుండు క్షణ మొక యుగముగా నున్నది. ఈ విరహమునకు తాళలేను కాని స్త్రీ సహజమైన లజ్జ యొకటి గలదు. దానిని వారింప జేయుటకు నీ యహేతుక కృపయే ప్రధానమని ముంగలపద్యంలో ఆ లజ్జ నభినయిస్తుంది నవోఢయై.

43. గోళ్ళు గిల్లు మోవిఁ గొఱుకుచు మునిపంట
శిరమువ్రాల్చి సిగ్గు జిలుక నిలుచుఁ
బయటకొనలు వ్రేళ్ళఁబట్టుచు మెలివేయు
హారమెత్తి కేల నటిటు బుడుకు.

ఈ పద్యంలో ముగ్ధా లక్షణము చెప్పబడింది. శయనమందిరంలో ప్రథమ రాత్రియందు పతిపర్యంకము పజ్జ నిలిచి లజ్జావనత ముఖారవిందయై బొటన వ్రేల నేల రాయుచు సిగ్గు మొగ్గలై స్థిరతలేని చిన్నారి కనుల ఎత్తి చూడలేక గోళ్లుగిల్లుకొంటూ పెదవిని మునిపంట గఱచుకొంటూ ముందరుదెంచు దంతనఖక్షతముల నెట్లెదుర్కొనుదు నని యాలోచించు చున్నదా! అనినట్లు కనబడుతూ ఉన్నది. ఇది స్వభావోక్త్యలంకారము. ఇందు లజ్జాబలం అధికం.

44. ఈ ప్రపంచ మన్ననేమొ సుంతెఱుఁగక
భయముఁజెందు ముగ్ధభావ మొకటఁ
బ్రణయకోపభావ ప్రకటన మొనరించు
చిలిపిపిల్ల సేయు చేష్ట లొకట.

ఈ ప్రణయ ప్రపంచ పరిజ్ఞానము నేమాత్రము తెలియక లజ్జాభయ వివశయై యుండే ముగ్ధాలక్షణాలు ఒక వైపు జూపి మధ్యమా ప్రౌఢా పద్ధతులలో ప్రణయ కోపభావ ప్రకటనంచేసే లక్షణా లొకవైపు ప్రదర్శించడానికి ప్రారంభించింది.

45. అన్నిదెసల బెదరినటు జూచి నోటిపైఁ
జేయివైచి 'యబ్బ సిగ్గులేదు
ఎవ్వరేని చూడనేమందు'రని యెంతొ
భీతిఁ జూపుఁ గొన్నిరీతు లొకట.

తనను ప్రియుడు బలవంతంచేస్తూ ఆలింగనాదులకు ఆత్రం జూపుతున్నట్లు నటించి, అబ్బ! ఏమిటండీ మరీ మీరు అంతకంతకు చిన్న పిల్లలై పోతున్నారు? కొంచెం లజ్జ ఉండొద్దా! నలుగురు చూస్తే ఏమనుకుంటారు? అని, అన్ని దిక్కుల ఎవరైనా వస్తులేరు గదా? చూస్తూ లేరు గదాయని భీతహరిణేక్షణలా చూస్తుంది. మా వారు చాలా మంచివారు చెప్పినట్లు వింటారు గదూ! అని బుజ్జగిస్తుంది. ఇది మధ్యమాలక్షణాల తెల్పుతుంది. ప్రేమ లజ్జ సమబలంతో ఉంటవి.

46. కొంగుబట్టి లాగ గుంజుకొన్గతి 'విడు
మబ్బ' యనుచు విసుగు నంది త్రోయుఁ

'గాని లెమ్ము జ్ఞప్తిలో నుంచు' మని శిర
మ్మూఁపి చూచు నోరచూపు లొకట.

చిన్న విషయంపై చిలిపికయ్య మేదో కొని తెచ్చుకొని బిఱ్ఱబిగిసికొని మూతి ముడుచుకొని కూర్చుండి నాయిక నాయకుడు బ్రతిమాలుతూ కొంగుపట్టి తనవైపు లాగికొన ప్రయత్నించ పయటకొంగు నిర్మొహమాటంగా విదిలించుకొని, అబ్బ-విడువండి నన్నంటకండి, దూరం పొండి అని భుజాలపై చేతులు వేసి వెనుకకు నెట్టివేస్తుంది. తానడిగిన కోర్కె నేదో పూర్తి చేయనందుకు మంచిదిలెండి, జ్ఞాపకంబట్టుకోండి నేనూ చూస్తానని తర్జించుచు ఓర చూపులతో క్రోధాన్ని పట్టుదలను ప్రకటిస్తూ శిరస్సును ఊపుతూ ఏం జేస్తానో చూడండి అన్నట్లుంది.

47. ప్రియుఁడు తొల్లి సేయు ప్రేమవిలాసముల్
తలఁచి తలఁచి నోట జలము లూర
మత్తు కనుల మొల్క లెత్త స్మితమ్ము మై
పులకరింప ఁదీపికలలు గాంచు.

తన ప్రాణప్రియుడు పూర్వం తనతో నొనరించిన ప్రేమవిలాస కలాపము లన్ని నోట నీరూరుచున్నట్లు తలపోసి, తలపోసి భావనానంద పారవశ్యంలో కనులు మత్తిల్లి మధుపానాతిశయంలో వ్రాలుచున్నట్లు కనబడగా మధురోహల స్వప్న స్వర్గాలలో విహరిస్తూ వుంటుంది.

48. చిన్న వోవ మోము చెక్కిటఁ గేలూ
ని సోలు మేనఁగండ్లు తేలవైచి
వట్టి పిచ్చి దానివలె నెందుఁ జూచిన
నందె చూచు మౌన యౌచు నురక.

49. ఎట్టు లిడిన దేహ మట్టులె పడియుండ
నిల్చిపోవు కనుల నీరు నిండ
నట్టె వదనమందు నుట్టిపడ నిరాశ
నెడఁద బరువుదీర విడుచు నూర్పు.

శృంగారము–విప్రలంభము, సంభోగ మని ద్వివిధాలు. ఇది విప్రలంభ శృంగార వికారచేష్ట. విప్రలంభ శృంగారము నాల్గు విధాలు– అభిలాషము, ఈర్ష్య, విరహము, ప్రవాసము. మొదలు నాయికా నాయకులకు దర్శన మాత్రమున వలపుగలిగి బాధ నిడుచుండుట అభిలాషము; నాయకు డన్యాసక్తుడైన నాయిక మనస్సు బాధపడుట 'ఈర్ష్య'; కలిసియున్న నాయికా నాయకుల కేదేని కారణమున యెడబాటుగల్గిన 'విరహము'. నాయికా నాయకులొండరుల వీడి దేశాంతరగతులగుట 'ప్రవాసము'. ఈ పద్యమునకు ముంగలి పద్యాల్లో ఇంచు మించు సంభోగశృంగార వర్ణనం సూచింపబడింది. ముగ్ధ, మధ్య, ప్రౌఢరూపాల్లో నాయిక వాని నభినయించింది. ఇట విప్రలంభ శృంగారంలోని కొన్ని యనుభూతులు వివక్షితాలైనవి. ఇందు మన్మథావస్థలు కొన్ని వ్యభిచారీ భావాలతో మేలగించి కనబడతాయి.

దైన్య, స్తంభ, అశ్రు, వైవర్ణ్య, చింతా, జడతా, గ్లాని, నిర్వేదాదులు సంచారీభావా లిందు ప్రదర్శితాలు. ప్రియుని విరహంలో ముఖకమలం మిత్ర విరహపద్మంలా చిన్నవోయింది. చెక్కిట చేయిబూనుట తీరని విచారమును సూచిస్తున్నది. దైన్యం మూర్తికట్టినట్లుంది ముఖం. కనుచూపుల్లో విషాదము విహరిస్తున్నది. ప్రణయం విరహాగ్నికి మంచులా కరిగి కన్నీరై స్రవిస్తూ ఉంది. ఉన్మాదావస్థ జెందిన పిచ్చిదానివలె శరీరధ్యాస లేకుండా చేష్ట లుడిగి జడీ భూత చేతస్కయై నిరుద్దేశ్యంగా ఎటు చూస్తే అటే చూస్తున్నది. చూస్తున్నాగాని ఎదుట గానబడు వస్తువుల్లో హృదయంలేదు. పిలిచినా మాటాడే పరిస్థితిలో లేదు. మౌనంగా బొమ్మలా నుండిపోయింది. మాటి మాటికి వేడి నిట్టూర్పు విడుస్తూ హృదయభారం తీర్చుకొంటున్నది.

50. నటన నిజ మొనర్చి నాతి కృష్ణుని విర
హంపురాధ పాత్ర నభినయించె
నాటవెలంది యొక్క యసమాన ప్రతిభకు
మురిసిపోయి రాజు ముగ్ధు డయ్యె.

సింగభూపాలుడు–ఆమె హావభావాది చేష్టితాల గాంచి ఇది నటనగాదు, ఇది నిజంగా నామీది యనురాగ వికారమేయని తెలిసికొన్నాడు. రాధాకృష్ణుల నడ్డముగా పెట్టుకొని తన అవ్యాజానురాగము నాయందెంతగా ఉందో ప్రత్యక్షపరచిన ఆయాట వెలదిప్రతిభకు ముగ్ధుడైనాడు. ఇలాంటి యవకాశము భోగినికి దప్ప మరొకరికి చిక్కుట అసంభవం

కదా! ఇది ముద్రాలంకారము. ఇంకా తన విరహమును చంద్రవసంత మన్మథోపాలంభములతో విపులంగా ముందు ప్రదర్శింపబోతూ తన చెలితో ఇలా అంటున్నది.

51. కురువృద్ధుండగు భీష్ముఁడు
శరతల్పగుఁడగుట బ్రహ్మచర్యత మనుటల్
స్మరశరదుర్భర ధాటికి
వెఱచియె కదె యనుచుఁ బొరలు విరితల్పమునన్

చెలీ! నాకీ పుష్పశయ్యయైనను కంటకముల పొరలినట్లుందేమి. పూల మార్దవం శైత్యం ఇచ్చేవి తద్వ్యతిరేకంగా ఎందుకు బాధ పెడుతున్నాయి? అందులకే వీటికి వెరచి గాంగేయుడు అంపశయ్యపై హాయిగా మేనువ్రాల్చి నాడేమో ఒక కార్యసాధన కుపకరించు (పూలు) వస్తువు తద్వ్యతిరేక ఫలితము (ముండ్లుగా) అనిపించుచున్నది గాన వ్యాఘాతాలంకార మిందు భాసిస్తున్నది.

52. చెలియా! స్మరశరముల కేన్
బలియగు చుండంగఁ జూడఁబాడియె నీకున్
వెలలేని పుణ్య మబ్బును
జెలువుని గూడుకొను దారిఁ జెప్పుఁ గదమ్మా!

కావున నో చెలియా ఈ స్మరశరునిధాటికి గురియై పరితపిస్తూ ఊరు కోవడం ధర్మమేనా? సుఖదుఃఖాలలో పాల్గొనుటయే స్నేహధర్మంగదా? నాకు ప్రియుని కలిసికొనే మార్గం చూపితే నీకు పుణ్యముంటుంది- అని చెలి సహాయం వేడుతుంది.

53. మలయానిలుఁడె వీనిఁ జిలువ పొట్టం బెట్ట
రంయని నడుమంతరమున నాడుఁ
జందురుం డఁట వీఁడు క్షయ మొందుగాక యీ
మూర్ఖచర్యలు నాఁడె మొగులుముట్టె
మాధవుం డఁట వీని మద మడంగ నదేమొ
మ్రొక్కిన కొలఁది కొమ్మెక్కి తూలుఁ
బూవిల్తుఁడఁట వీఁడు బుగ్గియైపోనేమి
యెఱుఁగని యటులుండి యేడిపించు

తుంటవిల్తు దం డబలను నొంటిదానిఁ
బొంచి మొనగానితనము జూపించుకొనెడి
విభుఁడు రానిమ్ము చెప్పెద వీరియాట
లపుడు తలక్రిందు లగును నాయాత్మనగును.

మనస్సు మంచిగా లేని వారికి అమృతంగూడా విషంలాగా వెగటుగొల్పుతుంది. అలాగే మలయమారుతంగూడా వడగాడ్పులవలె భరింపరాని పరితాపం చేకూరుస్తున్నది. అది మారుతము గాన గాలిపాములకు ఆహారమని తెలిసి “దీన్ని పాములపొట్టంబెట్ట” అని ఉపాలంభము చేస్తూన్నది. మనసు బాధించే వాళ్ల దుర్గుణా లేకరువు పెడతాం. అలాగే ఈ మలయమారుతం నెటి నడ మంతరముననే ఆడుతూ ఉన్నది. ఎంతగర్వం అంటూనే గాలి ఆకాశంలో అదే సహజగతిని చెబుతున్నదీవైఖరి ప్రస్తుతార్థమై ఆకాశగతిని చెప్పే పదాలతోనే ఆకాశంలో ఆడుతున్నాడు అనే నిందను సూచ్యంగా చెప్పడమైంది. “చంద్రుడట వీడు క్షయంగాను” వాడు ఎలాగూ క్షయాన్ని పొందుతూనే ఉంటాడు. ఆ గుణం ఈ నిందకు అక్కరవచ్చింది. వీనిచర్యలు మొగులు ముట్టినవి. అనడంలో వీని అపకీర్తికి, మొగులుముట్టిందనే నిందావ్యాప్తికి అవధికల్పించుతూనే చంద్రుని ఆకాశ సంచారం చెప్పడమైంది. మాధవుండట వీని మదమడంగ అని మధుమాసం యొక్క సహజగుణాన్ని తెలియజేస్తూ మ్రొక్కినకొలది కొమ్మెక్కి తూలు అని వాని పొగరుమోతుతనాన్ని నిర్వచిస్తూనే కొమ్మలపై వసంతశోభలు కనబడేదాన్ని చెప్పినట్లయింది. “పూవిల్తుడట వీఁడు బుగ్గియై పోను” అనేతిట్టు హరుడు స్మరుని బూదిజేయడమనే యథార్థాన్నిగూడ చెబుతుండడం లేదా? ఏమీ యెరుగనట్లుండే యేడిపించే నానిముచ్చు, అని తిడుతూ అతని యతనుత్వాన్ని చెప్పడమైంది. ఈ పైన పేర్కొన్న పరిజనాలంతా మన్మథుని దండు. వీరంతా మావారు ఇంట్లో లేని సమయాన్ని చూసి నన్ను ఒంటరి ఆడదాన్ని వేధిస్తూ తమ పురుషార్థం చూపించుకొంటూ ఉన్నారు. నా యజమానైతే రానీ వీరి భరతంబడతాను (అయితే, పతి విరహంలోనే కదా మన్మథుడు బాధించేది). మావారైతే రానిపుడు తలక్రిందులౌతుంది. పతి సాపేక్షతో తద్భిన్నంగా ఇవే నన్ను సుఖపెడుతాయి. నేను సంతోషంతో ఉంటానని చమత్కారంగా చెప్పడమైంది. ఇది వ్యాజ నిందాలంకారమును తెలియజేస్తుంది.

54. చలువచూపుల నగవు వెన్నెలలతోనె
తగరము కళాయి పూతల జగతి రుద్దు
నీలి మబ్బులఁదేలాడు బాలశశియె
పొగ పొదల గ్రాలు మంటల చిగురుబోలు.

ఈ చంద్రుడు చల్లని ప్రశాంత దృష్టితో తెల్లని చంద్రికల వృష్టితో కళగుచున్న తగరపు కళాయి పూతల జగతికి రుద్దుతున్నాడు. నల్లని ఆకాశంలో దేలాడు బాలచంద్రుడువలె పొదలవలె సున్న పొగల నుండి చిగురుల వలె కనబడు మంటయై వ్యతిరేకమైన ఫలితమునిస్తూ పయోముఖవిషకుంభంలా ఉన్నాడుగదా! ఇది అపహ్నుత్యలంకారము. ఇందు ఉత్ప్రేక్ష గూడ మిశ్రితమై యున్నది.

55. హరి హరీ! చచ్చి బూడిదయైనఁగాని
మారహతకుని నైజమ్ము మారదాయె
దగ్ధమయ్యుఁదా నితరులతాప మెఱుఁగ
డేటికే యన నిజ సఖి యిట్లు వల్కు

నులక కాలినను వడి గాల నట్లు యీ కందర్పహతకుడు కాలి కూలి బూడిద కుప్పయైనా ఇతరుల తాపవేదనల తెలిసికొన లేడాయెగదా! 'స్వభావో దురతిక్రమః' అని గదా పెద్దల సూక్తి అనగానే చెలి యిలా అంటున్నది.

56. చెలి! పద్మానన! చంచలోత్పలదళాక్షీ! మల్లికాహాస! మం
జుల మాకంద మనోహర స్తబకవక్షోజా! ప్రవాళాధరీ!
అలినీలాలక! జాళువా చిలుక! పుష్పాస్త్రుండు నీ వల్లనే
బలియయ్యెంగదె వాని కేను బలినై వర్తింతునం చేడ్తువా?

చెలీ! మన్మథునకు నేను బలినై పోవుచున్నానని పలుకుచుంటివి. ఎంత వింతగా నున్నది. నీ ముఖ మొక కమలమై నీ కనులు కలువలై నీ పలువరుసలు మల్లికలై, నీ వక్షోజాలు మావి పూలగుత్తులై నీ యధర మొక పల్లవమై నీవే ఒక బంగారు చిలకవై యుండుటచే ఆ యస్త్రముల నాధారంగా గొని వలరాజు నీ వల్లనే బలి–బలవంతుడైనాడు. శత్రువును బలవంతుణ్ణి జేసిన నీ వెవరిపై ఏడుస్తావు? నీ వల్ల ఐన అపరాధానికి ఎవరి నని యేంలాభం. ఇచ్చట బలి అనే శబ్దం ఈ పద్యానికి శ్లేషాలంకార రూప మిచ్చింది.

57. చెలి నీ వలపులు చోద్య
మ్ములుగదె! యివి మాకు నూత్నములుగా విపు డా
వల మురితాలుపు తాను
న్వలరాజిడువలను జిక్కి వలచు నవల నిన్

సఖురాలా! నీ వలపు ఎక్కడ కనీ వినసంత చోద్యంగా నున్నదే! మాకివేమి క్రొత్తగావు. ఆ మరుడు తానీ ప్రేమబంధాలే పెట్టకుంటే ఆ కృష్ణుడు మాత్రం నీకెలా కట్టుబడి పోతాడు? నిన్నెలా వలపిస్తాడు? నీకు మదనుడు ఉపకారియే కాని అపకారి కాడు. ఇందు ఛేకానుప్రాసము బింబిస్తున్నది.

58. పవనుఁడన్నను దన యయ్య పాన్పుతిండి
సోముఁడన మామబడబాగ్ని సోదరుండు
మాధవుఁడన నెయ్యుఁడు మధుమత్తుఁ డరయ
సచ్చరితుఁ డెట్టులగుఁ దాను లచ్చికొడుకు.

మిత్రుణ్ణి చూస్తే మధుపాన మత్తుడై యున్నాడు. అదే కాకుండా మలయమారుత మంటేనో, తన జనకునకు శయ్యయైన ఆదిశేషుని భోజనం; చంద్రుడు అతని మేనమామను విచారిస్తే బడబాగ్నికి సోదరుడు; చంచలయైన లక్ష్మికి కుమారుడైన మారుడు సచ్చరిత్రగల వాడెలా పోతాడు. 'సహవాసదోషేన *గుణాభవంతి*' మాధవుని సఖ్యం. మేనమామల పోలిక పిల్లలకు వస్తుందంటే ఆశ్చర్య పడాల్సిన పనిలేదు. ఆది శేషుని తిండియైన మలయమారుతాన్ని పిండుతే విషం వడుస్తుంది. తల్లి తీరు పిల్ల, ఇల్లు తీరు పందిలి యని చంచలయైన తల్లి గుణం రాకుండా ఎలా పోతుంది? కారణ కార్యసారూప్య ముండడంవల్ల ఇది వ్యాజస్తుత్యలంకారంగా భాసిస్తుంది.

59. కలధౌతద్యుతి నేలు కోమల లతాగాత్రిన్ మనోహారిణీ
తిలకన్ నూత్నవయస్కఁగూడి యమునాతీరాన డోలల్లవం
గలతాకుంజకుటీవిహారియయి యా గోపాలు ఁడొప్పారుటల్
తెలిసెన్ నాకొక వార్త యిచ్చటికిఁ బోఁదీరున్ భవత్కామనల్.

మనస్సు హరించు మంజుల స్వర్ణలతావిగ్రహ నొక గోపికతో గూడి యమునానదీ తీరాన లవంగలతా కుంజకుటిలో మనసిజకేళి మగ్నుడై మాధవుండున్నాడని విన్నానమ్మా నెచ్చెలీ యచ్చటి కేగినచో నీ కోరిక దీరును సుమ్మా!

*60.* *అనెడి చెలియ పలుకు విని రాధ ముదమంది*
*కుసుమ విశిఖతల్ప వసతి వీడి*
*సకియ నీదు మేలు జన్మలో మరతునె*
*అనుచు యమున జేర నరిగెఁ ద్వరగ*

ఈ విధంగా చెలికత్తె పలికినంత "దొరికెనమ్మా వెన్నదొంగ" అని పూల పాన్పు వీడి సఖీ ఈ జన్మలో నీ మేలు మరువజాలనని త్వరత్వరగా యమునా దరి కేగింది. ప్రియుని సమీపించు అభిసారికయై యరిగింది.

*61.* *తద్ధిణాం ధిమితహత ఝుంతరి-జంత జగధరి-*
*జగందకుకుందరి-కుకుంద తకుందరి-*
*తకుందకిణ ధిమితాం - తెహిధత్తతాం-*
*కిద్దకతా ననన్నన-తాజగంతరి-*

**మిశ్రగతి-ఉత్కళిక**

పొన్నపువ్వు వాసనల ప్రోవులు-పొగడపూవుల నెగడు తావులు
మల్లియల మొల్లల సుగంధము-నల్లగలువల చలువ చందము
పిల్లగాడుపు టలల ఁదేలుచు-నెల్లదిసలం దెగసి యాడఁగనూ
చవితి చంద్రుండస్తమించెను-సంతమస సంతతులు మించెను
కదలు వెన్నెల వలువలెల్లను-ఘనమషీ పంకమున బులిమెను
ఖంజరీటము రెక్కసాఁచెను-కజ్జలాద్రులు నిక్కిచూచెను
కటిక చీఁకటి కురులు విడ దిక్ - తటములందునఁ తాండవించెను
కన్నులం బొడిచికొన కనఁబడకున్న శూన్యపథాంతరాళము
ప్రన్నికొనెనా దివిని జలముగ్రభ్రమరవాహిని సముదయంబులు

పొన్నలు, పొగడలు, మల్లెలు, ఎల్లెడల పిల్లగాడ్పుల చేతులతో చలువల సౌరభాల పంచివేస్తున్నాయి. చవితినాటి బాలచంద్రుడస్తమించుటతో సకల ప్రపంచమును చీకట్లు లలమికొన్నాయి. దిక్కామినుల వన్నెల వెన్నెల సన్నమల్లు చీరలు మసిలో పులిమినట్లు మలినమై చెలువము గోలుపోయినాయి. కాటుక పిట్టలు గగనభాగమంతా రెక్కలుసాచి కలయ నిలిచాయా? చీకటికొండలు శిఖరాలతో నిక్కి అఖిలదిసల నాక్రమించాయా? లేక కాలరాత్రి నీలకబరీభరం విప్పి శివందూలుతూ చిందులు త్రొక్కుతున్నదా? అన్నట్లు సంతమసం వ్యాపించింది. కన్నుల పొడుచుకున్నా ఆ శూన్యాంతరాళంలో చుక్కలు వినా తక్కినలోకం సున్నాయై పోయింది. ఇంతలోనే కారు మొగిళ్లు నోరు దెరుచుకొని వచ్చి ఆ తారకలనుగూడా మ్రింగివేశాయి.

ఆ నిశీధిని ఫాలతలమున నలకలగు కాదంబినులలో
నీలవార్ధి తరంగ డోలలఁ దేలి తేపకు మిడిసిపడియెడి
మీను బిల్లల వోలె మిలమిల మిలుకు మిలుకు మిలుక్కు మనుచున్
కాలవల్మీకములు వెలువడి కసిబిసిగ వడి పెనఁగులాడెడి
త్రాఁచుపరువులవోలె తళతళ తళుకు తళుకు తళుక్కు మనుచున్
చక చకచ్చక ఛక్కు మనుచును చంచలలు నీలాంబరమ్ముల
నంచులై కనిపించి చనుటయు నవని చీఁకటు లావరించెనుగా.

ఆ నిశాకాంత ఫాలభాగాన నీలాలకలు నృత్యం చేస్తున్నవా అన్నట్లు చీకటి యాకాశంపై కారుమబ్బులెన్నో చేరుకున్నాయి–నీలసముద్ర తరంగాలవలె తేలియాడే యా మబ్బుల మధ్యలో మిడిసియాడే మీనుబిల్లలవలె మరియు చిమ్మచీకటిలో గ్రమ్ముకొన్న కాలమేఘాలనే నీలవల్మీకాలలోనుంచి బయటబడి పగలురేగ కసిబిసిగా పెనగుచుకాట్లు లాడుకొనుచు తళ తళ మెరసే త్రాచు పాములవలె నింగినీలాంబరాల చేలాంచలాల్లో చక చకా మెరసాడే జల్తారు అంచులై మించుతీవలు మెరసియాడుతున్నాయి. ఇందు ఉపమారూపాకాలంకారాలు రూపింపబడినాయి.

ధరగిరులపై దాడి వెడలిన సురల రథములె యుఱుకు లిడునో
వజ్రియే ఛందన మొనర్చునొ వడిగిరుల ఖండన మొనర్చునొ
గిరిశిఖరములె దొరలిపడునో కరులు ఘీంకృతి ఁగలియఁబడునో

ధణధణంధణధాణధందణ డడడడడడడఢాండఢమ్మని
గర్భనిర్భేదముగ నుఱుములు నార్భటింపగ నవని చెవుడుపడె.

కొండలమీదికి దండు వెడలిన సురల రథాలే ఉరుకు లిడుతున్నాయో? సురరాజు యుద్ధంలో గిరిశిరాల ఖండిస్తున్నాడో? నరుకబడిన గిరిశిఖరాలు ధరాస్థలి దొరలిపడుతున్నాయో డడడ ఢామ్మని గర్భ నిర్భేదకర ప్రళయ ధ్వనులతో మేఘా లురిమిపడుతున్నాయి. సందేహాలంకారము పొందుపరచబడింది పై పంక్తుల్లో-

రివ్వుమని యిటువైపు పొఱుచుఁ జివ్వుమని యటువైపు దూఁగుచు
నుర్వినంతయు నూఁపి వైచుచు నుదధి జలముల లోపివైచుచు
రయ్యిమని వడిరవముసేయుచు కుయ్యిమని దివి గోలసేయుచు
రివురు రివురు రిరివురు రివ్ రివ్ రివ్ రిరిరివ్ రిరివ్ మని
రివురురివురు రిరివురురిన్ రివ్‌రివ్ రిరివ్ రిరిరివ్ రిరివ్ నును
వాయుదేవుని ప్రళయతాండవ వర్తనములకు శివము దూలుచు
ఛరర రరరర ఛట్లు మనుచును దరులశాఖలు ధరణిఁగూలఁగ
లతలు కుంజము లతుకులన్ విడి కుతలమందున కూలిపడఁగా

వాయువులు రివురివ్వుమను శబ్దాలతో ఉర్వినే ఊపివేస్తూ సముద్రజలాలనే లోపివేస్తూ రుయ్యని గోలచేస్తూ ప్రళయతాండవం చేస్తూ ఉంటే తరుశాఖలు ఛర ర ర ఛట్లుమని ధరణిపై విరిగిపడుతున్నాయి. లతలు జొంపముల నిలువ లేక నేలగూలి రూపరిపోయినాయి. ఇలా ఝంఝూ మారుతం హోరున వీస్తుంటే,

హోరుమను ఝంఝూనిలమ్ముల భోరుమను వర్షారవమ్ములు
రింజరింజ రిరింజ రిరిరింరింజ రింజ రిరుం రిరిమ్ రిఝుమ్మని
తెఱపి నీయక చఱచికొట్టుచు కరకసంహతి విసరిపెట్టుచు
మూగి కురియు ఘనాఘనమ్ములు ముంచి యెత్తె ధరన్ జలమ్ముల

భోరున వర్షం కురియడం ప్రారంభించింది. చఱచికొట్టే ఆ వానలో ఱాళ్ళు పడుతున్నాయి. ముసిరికొని జోరుగా కురిసే యా వనభూమిని నీళ్లల్లో ముంచెత్తింది.

పొఱు యమునా తీరములలోఁ బద్మయుత కాసారములలోఁ
బల్వలాగత నీరములలో వార్యుతాశ్మాగారములలోఁ

జేరువలలో దూరములలో మంద్రమధ్యమ తారములలో
రటటరట్రురరట్ర దుర్దురపటురటద్ధన శబ్దములలో
వటువు వేదము వల్లెవేయునొ వరుణపతి జయభేరి మ్రోయునొ
తాకుడెకణకు డేకు పూర్ణ తటాకముల మండూక శబ్దములు
కిడ్తక-నగణ నగణగనగణ నగణగన గణనగణ గనగం
కిడ్తక జగ జజగజగ జగ జజగ జగజగజజగజగజగం
కిడ్తక డెగడ డెగడెగ డెగడ డెగడెగ డెగడడెగడెగడెగం
తగనగణ నగణ గనగం తగజగ జజగజగజ గంత గడెగడడెగడె గడెగం
తగనగం-తగజంగం-తగడెగం-నగం-జగం-డెగం-బహుగతి
నేక ముఖముగ భేకలోకము వీఁకమై ఘోషింపగా

ఆ వర్షాతిశయానికి యమునాతీరాలలో జలపూరాలలో సరోవర నీరాలలో జలపూరితాలైన అశ్మాగారాలలో బ్రహ్మచారి వేద పఠనం చేసున్నాడా లేక వరుణుని జయభేరి మ్రోస్తున్నదా అన్నట్లు మండూకాలు బెక బెక శబ్దాలు చేస్తున్నాయి. పైనున్న జతి మండూక శబ్దాన్ని తెలియజేస్తుంది. ఇలాంటి వాతావరణంలో –

అందు తానొక యందముల గని నందనోద్యానంపుటామని
ఇందుధరు వలపించు మోహిని సుందరుల కెల్లను శిరోమణి
వచ్చెనట వెదకుచును బిల్చుచు వచ్చెనా బృందావనమ్మున జొచ్చెను
విద్యుత్తు భువిదిగివచ్చెను వర్షమ్మ మరి మరి హెచ్చె నావర్షంపుధారల
కడుగబడియెడి కనక రథమన కదలు మాణిక్యావసథమన
అంబరము మాటైన చందురు బింబమో జలవీచిగత వికచాంబుజమొ ప్రియునరసెడి చకోరంబొ యన నితరమ్ము మఱచును

తమోభిసారికయైన రాధిక శ్రమలెన్ని ఎదురైనా లెక్కింపక అక్కడకు వచ్చింది. ఒక అందాల గని, నందనోద్యాన వనంలోని వసంతపుష్పుణి, కందర్పహారుని వలపించిన మోహిని, సుందర యువతులలో శిరోమణియైన ఆమె పిలుచుచు ప్రియుని వెదుకుచు కురిసే మేఘాల్లోనుండి ధరణికి దిగివచ్చిన మెరుపుతీగయా అన్నట్లు బృందావనంలోకి వచ్చింది. వర్షం కూడా హెచ్చింది. ఆ వర్షపు ధారల్లో కడుగబడే కనక రథమో లేక

కదలియాడే మాణిక్యమందిరమో లేక జలదాల్లో దాగియాడే చంద్రబింబమో జలతరంగాల్లో మునిగియాడు సరోజషండమో కాక చంద్రుని వెదుకుచూ వచ్చిన చకోరపక్షియో అన తదితరమంతా మరచివచ్చింది.

ఏటికో యమునాతటీవని నేగునా నిశి నేమియో పని
మాటిమాటికి మాధవా యని మధురరుతములు ఁబిల్చునేరిని
తడియు వానకు జడియ దిరులకు తరువు తరువును దరియు నేలకొ
పొదపొదనుగని వెదకు నేమియొ యెద విసుగుకొను నెవరు లేమియొ
విటపముం గని ప్రియుని కేలని విడుచు వెంటనె మృదుత లేమిని
మధువొలుకు విరి నధర మనుకొని భ్రమనుగొని చుంబన మొనర్చును
వృంతమెడలి లతాంత మెడగా నెంతపని యయ్యెనని వగచును
వననికుంజము మాధవుండని భ్రాంతి పరిరంభణ మొనర్చును
పొదలుశంపాకాంతిలోఁగని పొదరు లివియని వదలి యేడ్చును.

ఈరాత్రి యమునా తీరాన ఈమెకు గల పనేముంది? మాధవా యని మహారణ్యము మార్మోగునట్లు పిలుస్తుందేమి? ఎవరిని ఆహ్వానిస్తున్నది? ఇంత సుకుమార శరీరముగల ఈమె వానకు, ఈ చీకటి కోనకు ఏ మాత్రం భీతిల్లదు. చెట్టు చెట్టు పొద పొద ఎవరి కోసం వెదకుతున్నది? ఎవరు లేరనో విసుగుకొంటుందేమి? ఉన్మాదమా లేక భ్రాంతియా? కోమల తరు శాఖను కేలను కొనిపట్టి మార్దవం లేదే అని విడుస్తున్నది. తీపి మందారాలను అధరమని యెంచెనో ముద్దిడికొనుచున్నది. పెదవి యొరపిడికి తట్టుకొనలేక ఆ ప్రసూనము క్షోణిపై రాలింది. ఎంత పనై పోయెనని వంతనొందుతూ జొంపము నొక దాన్ని గాంచి దొంగ దొరికాడని చేస్తున్నది. అదో! ఆ మించుల మెరుపుల్లో చూచి ఇవి పొదరులా అని వదలి విలపిస్తున్న దేమి? ఇందు భ్రాంతిమదాలంకారం కనవస్తుంది.

పతినిబాసిన రతికుమారియొ భవుని వీడిన గాంగవారియొ
కాకఁబెట్టిన మరుకటారియొ కేక లిడియెడి వనమయూరియొ
హోరుమని ప్రవహించు యమునా చారురవవీణా శ్రుతింగొని
ప్రతిదిశం గని పిల్చు నేరిని ప్రతివచనముగ వచ్చు నా ధ్వని.

పతిని వీడిన రతీదేవి కాదుగదా! పరమేశుని వియోగములో పరుగుదెంచు గంగా భవానియే యమునాతటి పైనిల్చి మాధవా యని కేకవేస్తే ఆమె ధ్వనియే నీటిపై నుండి తిరిగి వస్తున్నదే కాని అచటినుండి ప్రత్యుత్తరమే వస్తూ లేదు.

ఓ దొరా! పిల్చునది యిది నీ రాధరా! యనరాని ప్రణయపు
బాధరా! దయనీయ మీ నా గాథరా! రారాదురా! యనుఁ
బలుకరా! యీదాసిపై నీ కలుక రా! రాగామృతంబున్
జిలుకరా! యెద పంజరపు నా చిలుక రారా చిలిపిమారా!
రార! నవమన్మథాకార! రాధికా చిత్తాపహారా!
రారా! నందకుమార! సుకుమార! నవనవనీత చోరా!
బాలగోపాలా సుమాస్త్రుని బాధలకు నే తాళజాలర
మరుదు నన్నీ విరిశరమ్ముల మాటిమాటికి నేచసాగెర
తరులు నిన్నే పిలుచు చూడుము గిరులు నీకై నిలిచి వేడును
ఝరులు నిన్నన నుఱుకులాడును ధరయె నీ స్వాగతము ఁబాడును
తరుల నీసుందరతఁగంటిని గిరుల నీ సుస్థిరతఁగంటిని
ఝరులలో నీకరుణఁ గంటిని ధర క్షమాగుణపరతఁగంటిని
ఆది మధ్యాంతరహితుడవని యాకసపుముఖముననె వింటిని
అన్నియును నీవె అనికొని నే నవ్యయుని నినుగనక యుంటిని.

నా హృదయ పంజరపు చిలకా! నను వలపించిన చిలిపి మారా! ఈ పిల్చేది రాధరా! అనలేని ప్రణయబాధ ననుభవించు నాగాథ దయనీయమురా! నీ రాగామృతం చిలికి నామదనతాప మార్పరారా! మన్మథుడు మాటి మాటికి విరిశరములచే పరి పరి విధముల పరితాపమునకు గురిసేయు చున్నాడు. అదో హస్తము లనదగు కొమ్మల నూపుతూ తరులు నిన్నే పిలుస్తున్నాయి– నీవు వైకుంఠ వాసివని తెలిసి గిరులు తమ హస్త శిఖరాలను మింటికి చాచి వేడుచున్నాయి. నీవు క్షీరాబ్ధివాసివని ఝరులు నినుగాంచుటకై ఉరుకులు పెడతూ వస్తున్నాయి. నీవు ఆదిమధ్యాంతరహితుడవని ఆకాశం చూపిస్తున్నది. అన్ని నీవేయై కనబడుతున్నావు. అవ్యయుడవై అసలే కనబడకున్నావేమి? భక్తి సగుణారాధనను వాంఛిస్తుంది. ఇందు స్మృత్యలంకారము కనబడుతుంది.

దొంగ నీవే దాగియుండ నెఱుంగ బ్రహ్మాతరమ్ము గాదుర
కలికి చూపుల కామితము లిడు కల్పవృక్షము పూలుబూయగ
చిలిపి నవ్వుల సొగసు సురగవి చేఁపులై మధుసుధల గురియగ
రార! నవలావణ్య మదనాకార! సుమసుకుమార! సుందర
నీరదాభశరీర! నందకిశోర! శిఖిపింఛావచూడా!

నీవు అంతర్యామి రూపివై దొంగవలెనున్న నిన్ను బ్రహ్మాదులును గుర్తించలేరు. నీవు విభవావతారుడవైన గోపాల రూపివై, చూపులలో సురవృక్షం పూలుపూయ, కమ్మని నవ్వుల్లో కామధేనువు అమృతవృక్షం గురియ రారా! నందకిశోరా! కొండిసిగలో నెమిలి తురాయిగల కోడెకాడా! నాజోడా! రా!

నమ్ము నాదైవమ్ము యీ రూపమ్ము యౌవనమెల్ల నీదే
సొమ్మురా! నిను విడిచి యీజీవమ్ము వమ్మగు నిది నిజమ్మురా
మ్రొక్కెదను నాదిక్కు నీవే యెక్కడికిఁ బోయెదను వద్దన
చక్కదనములమూట రతిసుఖసౌరభపు! పూదోఁట రారా
తనువు తనువుం బెనఁగి ప్రణయోద్యానవల్లిక లల్లుకొనఁగాఁ
గనులు కనులుం గలిసి మరువాసనల నీనెడి మల్లియలుగా
నురము నురమునుఁ గదిసి హృదయమ్మొక్కటే యను మాటచాటగ
నధర మధర మ్మొరసి యద్వైతానుభవ వల్లకుల మీటఁగ
మక్కువలయానంద డోలిక లెక్కి మైమర పెక్క మత్తిలి
చొక్కుదమురా! సోలుదమురా! సుఖజలధిలోఁ దేలుదమురా!
సొరలు తరఁగలఁ కూడి యాడెడి పూలమై విహరించుదమురా!
పూలతావులఁ దేలు చల్లని గాలియై దివి నేలుదమురా!
గాలితాఁకుల కరగి కురిసెడి నీలిమబ్బయి వ్రాలుదము న
న్నేల నిటురావేల? రాధాలోల! కనకసుచేల! మృగమద
ఫాల! స్మితదృగ్జాల! ధృత వనమాల! నా గోపాల!
కొనుమిదె జోహారో ప్రియ! జోహారో సఖ!
జోహారుల్ వేజోహారుల్

తత్తక్కిట తక్కిట కిడతక దిద్దిక్కిట ధిక్కిట కిడతక తొాంగిడతక -నంగిట కిడతక తతతధిగిణత-తతతధిగిణత-తతతధిగిణత.

నా పరదైవమా! నన్ను నేను ఆత్మసమర్పణ భక్తితో నీ కర్పించినాను గాన యీ రూపము ఈ యౌవనమంతా నీదేసొమ్ము. నీవు విడిచిన ఈ జీవము అధోగతి పాలౌతుంది. ఇచట అనన్య శరణత్వం చెప్పబడింది. నీవు వద్దంటే నే నెక్కడికిపోతాను. ఇట అనన్యగతికత్వము నిర్వచింపబడింది. చక్కదనముల మూట, ఎవని సౌందర్యపు నవరత్నఖనిలో మన్మథుడు తా నొక మచ్చు పిసరో అతడు చక్కదనాలకు నిధికాదా? "రూపౌదార్యగుణైః పుంసాందృష్టి చిత్తాపహారిణం". "పుంసాం మోహనరూపాయ" అనుటచేత జగదేకసుందర రూపుడని చెప్పడమైనది. పరబ్రహ్మ వీవు కావున నీతో రతి బ్రహ్మానందసుఖము దప్ప అన్యం కాదు. దానిని మించిన సుఖ మేదుంది. "వాసుదేవ తరుచ్ఛాయా నాతిశీతా నఘర్మదా" అనడంచే, నీవొక కల్పవృక్షమవు. నీ నవ్వుల చూపులే దానిలోని వాడిపోని పువ్వులు. నీ అభయహస్తచ్ఛాయయే మాకు భవతాపములు బాపెడి తరుగని నీడ. అందుకే నీవు నందనవనరూపుడవు. తనువు తనువు కలియుట సారూప్యము. కనులు కనులు గలియుట సాలోక్యము ఉరమునురముం గలియుట సామీప్యము అధరమధర మ్మొరసియద్వైతానుభవము గలుగుటయే సాయుజ్యముక్తి. అది ప్రాపించుటకే మక్కువల యానందడోలిక లెక్కి మైమరపెక్క యనుటచే "సాత్వస్మిన్ పరమ ప్రేమరూపా" అని ప్రేమము నిష్కామంగా విలక్షణంగా ఉపాసించబడిందని తెలియబడుతుంది. దేహాత్మ భ్రాంతి వీడుటే మైమరచిపోవడం -స్వస్వరూపజ్ఞానం గలిగినదిగా భావించాలి. సుఖజలధి ఆత్యంతిక సుఖ మని తెలియజేస్తున్నది. జీవాత్మ పరమాత్మ లనునట్టి రెండుపూ లేకమైననే అందు విహరించడం జరుగుతుంది. ఆ గాలిలో తాపత్రయాదులచే సంభవించు వేడి నశిస్తుంది. ఆ నీల మేఘశ్యామునిలో సమైక్యమై కరగి రసస్వరూపునిగా మారి సాయుజ్యం పొందడమే రాధ భావ మనుట స్పష్టం. ఇందు విటపముం గని ప్రియుని కేలని మధు వొలుకు విరి నధర మనుకొనిచుంబన మొనర్చును. మంజుకుంజము మాధవుండని పరిరంభణ మొనర్చును. అనుచోట్ల భ్రాంతిమదాలంకారము భాసిస్తున్నది. పతిని బాసిన రతికుమారియొ భవుని వీడిన గాంగవారియొ-అనుచోట సందేహంతోపాటు ఉల్లేఖం కనబడుతుంది.

"తరుల నీ సుందరతగంటిని-ఝరులలో నీ కరుణగంటిని-గిరుల నీ సుస్థిరత గంటిని, ధరక్షమాగుణ పరతగంటిని. ఆదిమధ్యాంత రహితుడవని ఆకసపు ముఖముననె వింటిని" అనుచోట స్మృత్యలంకారము స్ఫురిస్తుంది. విశ్వరూపము నీదేననే ధ్వనిగూడా

ఉంది. "కలికిచూపుల కామితము లిడుకల్పవృక్షము పూలు బూయగ చిలిపినవ్వుల సొగసు సురగవిచేపులై మధుసుధల గురియగ" అనుచోట నిదర్శనాలంకారము భాసిస్తుంది. "చంచల నీలాంబరమ్ముల యంచులై కనిపించిచనుటలో రూపకాలంకారము గోచరిస్తుంది. "గిరిశిఖరములె దొరలిపడునో కరులు ఘీంకృతి కలియబడునో" అనుచోట సందేహాలంకారమును నిరూపిస్తుంది. దీనిలోని తుదిజతిలో ఏడక్షరాలతో త్రిపుటతాళము ముక్తాయింపు వరుసలు సాగిపోయినవి.

62. చేతులు సాగ వ్రాల్గనులు చేడ్పడ మందత నావులించు నా
కూతముతో నొడ ల్విఱుచుకొంచు నురోజభరోత్కటమ్ము నా
త్మేతర వస్తువాహ మటు లెయ్యెడనో పడవేయఁ ద్రోయు నాఁ
గోఁతవడు న్వడిన్మొదలు గొట్టఁ జలించు లతాంగనాగతిన్.

సంయుత ముద్రయైన కర్కాటక హస్తముతో ఆవులిస్తూ ఒడల్విరుచుకొంటూ వ్రాలుగన్నులతో ఉరోజాల భరోత్కటాన్ని తాను మోయరాని భారంలో ఎచ్చటనో పడవేయడానికి ప్రయత్నిస్తున్నట్లు కోతపడటాన్ని తెలియజేస్తూ మొదలుగోసిన లతవలె చలించిపోతుంది. ఇచట మదము, శ్రమము, దైన్యం మొదలగు సంచారీ భావాలు ద్యోతకమౌతున్నాయి.

63. వలవల యేడ్చు వా డెచట వచ్చు నబద్ధము రాఁడటం చెదోఁ
తలఁచును నెందొ చూచుఁ గనుదమ్ముల రెప్పలు వేయఁదూర్చి బి
ట్టులకుఁ బయోజభార పృథులోరము కంపమునంద దోఁచదే
'చెలి! యిక నేమి సేయవలె చెప్పవదేమె' యనున్ మినున్ గనున్.

ఇందు నాయిక ప్రోషిత భర్తృకయై వాపోయే విధానం చెప్పబడింది. దేశాంతరగతుడైన తన ప్రియుడింక రాడు. రాక అబద్ధం అని నిరాశచెంది వలవలా యేడ్చి పరాకుగా నేదోతలపోస్తూ కనురెప్ప వాల్చక ఎటోచూస్తూ ఉరోజభారము కంపించేలా ఉలిక్కిపడుతూ చెలీ! నాకేమీ తోచదే ఏమి చేయాలో చెప్పవే! అని ఆకాశం కేసి చూస్తూ కన్నీరు విడుస్తుంది.

64. 'అమ్మ రేపు వత్తు నటంచు నమ్మఁబల్కె
మొగముముందు ప్రేమను జూచి మోసపోతి
నెన్నినాళ్లాయెనే యతఁ డేఁగి' యనుచు
ముక్కుపై వ్రేలినిడి మౌన ముద్రఁబూను

65. సవ్యకరాంగుళు లొగి నప
సవ్యపు తర్జనిని మఁడచి స్వప్రియ విరహో
ప్నివ్యవధి నెంచు నూహో
కావ్యములల్లును విషాదకంధి మునుంగున్.

పై రెండు పదాల్లో గూడా ప్రోషిత భర్తృకా అనే నాయిక సాక్షాత్కరిస్తుంది. రేపు వస్తానని నమ్మకంగా చెప్పిపోయి ఎన్నాళ్ళయిందే చెలీ! నేనతని మొగము ముందరి ప్రేమజూచి మోసపోయినాను. అబ్బా! అని ముక్కుపై వ్రేలిడి ఎంత మోసమన్నట్లు నటిస్తూ మౌనముద్ర బూనుతుంది. ఇది చెప్పలేని అన్యాయం-మోసం అని భావన ధ్వనిస్తుంది. కుడిచేతి చూపుడు వ్రేలుతో ఎడమచేతి చిటికెన వ్రేలువద్దనుండి 'ఒకటి రెండు' అని దినముల లెక్క పెడుతూ ఎవతెను తగుల్కొనెనో! అది యేమిమచ్చు మందిడెనో? ఇక ఎక్కడి రాకయని ఊహాకావ్యాలు అల్లుతూ విచార భార సముద్రంలో మునిగిపోతుంది. కన్నీరు గారుస్తుంది, కర్తవ్య విమూఢయై.

66. బడిబడిం బఱతెంచు బాష్ప స్రవంతిలో
దెగిజారు మంచి ముత్తెముల పేరు
గాద్గద్య సందీప్త కంఠస్వనమ్ములోఁ
దరిదట్టి పొరలు దుఃఖరస ఝురులు
రాగార్త బింబాధర స్పందనమ్ములోఁ
జిరుగాలిఁ గదలు కెంజిగురు గుదులు
రోమాంచ సముపేత కోమలాంగకములఁ
బ్రభవించు బరుసైన పద్మలతలు....

బడిబడి ప్రవహించు బాష్పప్రవాహం మంచి ముత్యములపేరు తెగిజారిన పూసలవలె కనులనుండి బిందువులు బిందువులుగా నేలరాలుతున్నది. కంఠము దట్టి పట్టిన దుఃఖముగల గద్గదస్వనము ఒడ్లు ఒరుసుకొను ఖేదనదీ ప్రవాహములు స్రవించుచున్నది. ఆర్తితో నదరుసూపిన యధరపుటములలో ఝంఝూవాత హతికి కెంజివురులు గదలి చెదురుతున్నవి. పులకాంకురము లొలయు పుత్తడి వన్నె మేనిలో బరువైన పద్మలతల ప్రభవము ప్రదర్శింపబడుతున్నది. ఇట్టిది ఉపమానోపమేయ వాక్యార్థములను అదే యిది యనునట్లభేదము చెప్పుటచే నిదర్శనాలంకారముగా రూపొందించబడింది. కనబడే ప్రపంచాన్ని తననుతాను మరచిపోయి వక్తశ్రోత తానేయై వదరుకోవడంలో వ్యభిచారీ

గత అపస్మార చపలతలు ఉన్మాదాది భావములు ప్రస్ఫుటాలైనవి. ఇందు గమ్యోత్ప్రేక్ష భాసిస్తుంది.

67. ఎచ్చటినుండియో సుమధురేరిత వేణు సుధాతరంగముల్
వచ్చుచు నున్నయట్టు లటువైపు శ్రుతిం బచరించి ప్రాణముల్
వచ్చినయట్లు తోనె స్మితవైఖరి లేచి యదేదిశన్ గనుల్
విచ్చి కరమ్ము మాటుగొని వేమరు నట్టిటు గాంచు కాంక్షమై.

ఎచ్చటినుండియో వేణుగానామృత తరంగాలు వినిపిస్తున్నట్లు చెవిబెట్టి ప్రాణంవచ్చినట్లు నవ్వు మొగంతో లేచి ఆ నాదం వినవచ్చే దిక్కు కన్నులువిచ్చి చేయి మాటిడుకొని కాంక్షలిగురొత్తగా అటిటుచూస్తూ సంతోషం ప్రకటిస్తున్నది. ఇందు విలాసం ప్రదర్శితమైంది.

68. అదిగో! చెలి యిది యమునా తటాంచలమ్ము
నుండి వచ్చెడి నని చంక నొక ఘటమ్ము
నమరిచికొని నీటి కని రాయంచనడల
వెడలి యద్దరిఁబాడు గోవిందుఁగాంచి.

అదో! చెలీ! ఇది యమునానదీతరంనుండి వినవస్తుంది. అదో! అని ఆవలి తటంలో మురళీగానం చేయు ముద్దురూపు గాంచి మంచినీటి మిషబెట్టి కొని చంక కడవ నిడి రాజహంసివలె రమణి హొయలొల్క పోతున్నది. ఎవరికి తెలియకుండా ఇలా అంటున్నది.

69. గాయక శిరోమణీ! పికాగ్రణి! విశాల
విమల యమునాతరంగిణీ వీచికలను
బంపు సందేశరూపక ప్రణయగీతి
రాగవేగమ్మునకు గుండె లాఁగలేవు.

ఓ నల్లని పికరాజమా! గాయక శిరోమణీ! యమునా తరంగాలతో పంపుచున్న ప్రణయ సందేశరూపక గీతి రాగ వేగానికి గుండె లాగడం లేదు- (పికాగ్రణీ) కృష్ణునికి సంకేతం (రాగవేగం). ప్రేమోద్వేగం ఆపుకొనలేకున్నాను. అని గూఢంగా చెప్పింది-ఇది గూఢోక్తి అలంకారము.

70. కొమ్మతావులఁ గోయిల కూయుఁగాని
యాయెడారుల రాగమ్ము తీయఁబోదు
కొమ్మకోయిల విరహదుఃఖమ్ము యమున
యేఱులై ప్రవహించు ముం దెటు తరించు?

71. కొమ్మ రాగము కరపల్లవమ్ము నూఁపెఁ
గోయిలంగల రాగమ్ము గొంతువిప్పె
నస్వతంత్రయౌ కొమ్మతా నరుగలేమి
సిగ్గువిడి కోయిలయె తాను జేరవచ్చె.

కొమ్మ (స్త్రీ) లున్నచోట వానిమాటలో కోయిల రాగము (ప్రేమ) ప్రయోగించుగాని ఇసుక యెడారుల రాగము నాలపించదు. కొమ్మయొక్క కోకిల విరహాంధకారమే యమునా నదియై ప్రవహిస్తున్నది. దీని నెలా దాట గల్గుతుం దీకొమ్మ. అంతే కాదు కోకిల రాగము కొంత విప్పి చెప్పగలదు. కొమ్మ రాగము కరపల్లవమును మాత్రమే యూపగల్గుతుంది. కొమ్మ అస్వతంత్రయౌటచే కొమ్మ రాలేదు. తన హృదయాన్ని విప్పి చెప్పలేదు. అందులకే కోకిలే కొమ్మ వద్దకు రావలసిఉంటుంది. అని కృష్ణుని తన వద్దకు రమ్మని వివరం చెప్పింది. ఇది వివృతోక్తి అలంకారము.

72. యమున నీటికై యీఘట మ్మరుగు దెంచి
నీదు రాగామృతమ్ముతో నిండిపోయె
దీని మోయఁగా నేను నాలోన లేను
వత్తువే దీని నెత్తనో వన్నెకాఁడ!

73. నాదు మోహాంధకార పూర్ణ హృదయంబు
కరఁగి నల్లని యమునయై యుఱుకులాడు
దీనఁబడి కొట్టుకొనిపోవు దీన నేను
నీవెకావె యద్దరిఁ జేర్చు నావ వనఘ!

యమున నీటికై వచ్చితి ననడ మొకమిష. నీ రాగామృతంతో యీ ఘటము-(దేహము) నిండిపోయింది. దీని మోయలేను. నీవే భర్తవై యుద్ధరింపవలెను.

నేను నాట్యమను మిషతో వచ్చినానుగాని నీయనురాగామృతము నాహరించుటే ప్రధానోద్దేశ్యము. నా విరహాంధకారము యమునవలె నల్లగా నురుకు లాడుతున్నది. దీని తరింపజేయు నావవు నీవే! అని తన మనోద్దేశ్యము ధ్వనిగా వినజెప్పింది.

74. ఇది యతడు విని ముదమంది యువలియొద్దుఁ
జేరవచ్చిన ట్లాతని చెంత కరిగి
రంగురూపుల గాంచి యారాత్రి యెవతె
యొద్దనో ప్రొద్దుబుచ్చిన ట్లూహసేయు.

75. 'ఎఱుపెక్కె గనులు నిద్దురలేక యెవతెను
గూడియో' యనఁగాదు 'వేఁడి' ననుచు
'గంట్లొనర్చెను నీదు కమ్మవాతెఱకు
నేచెలి' యనఁ 'గా దిది చలి' కటంచుఁ
జెదరె నీ యందాల శిఖిపింఛ మేతన్వి
కేళినో యనఁ 'గాదు గాలి' కనుచు
నాసపైఁ గాటుక నలుపు లేకన్నుల
'కలికివో' యన 'జాఱెఁ దిలక' మనుచు...

రాధ: కనులు నిదురలేక ఎఱుపెక్కినవి-యెవతెను గూడి?
కృ : కాదు ఇది 'వేడి' అన్నాడు
రా : నీదు కమ్మవాతెఱకు గంట్లొనర్చిందే 'చెలి'?
కృ : కాదిది 'చలి' అన్నాడు
రా : నాసికపై కాటుక కన్నుల నలుపు లే 'కలికి'వి?
కృ : కాదిది. జారిన కస్తూరీ తిలకము.

రాధ ఈర్ష్యతో కృష్ణుని పొమ్మని ప్రణయాగ్ని కీలవలె నర్తించింది. కృష్ణుడు శాంత గంగా ప్రవాహమై వేడుకొని కోపాన్ని శమింపజేశాడు.

హరి ముగ్ధవధూ నిక రే
తరుణి విలాసిని విలసతి తత్కేళిపరే
పరిరంభణ చుంబన వర
సురతవినోదే యటంచు సుదతి నటించున్.

హరిముగ్ధవధూనికరమునందు కేళీపరమై ఆలింగనచుంబనాదులతో సురతవినోదము గావించినాడు. హరియను పేరు సింగమునకు జెల్లుటవల్ల నీవు నన్నింక పరిగ్రహించి యనుభవించుమని ధ్వని.

రమణి! నీయెదఁ బొంగారు సుమమనోజ్ఞ
హేమకలశ వినిర్గత ప్రేమ సుధలు
రమ్య మధురస మధుర నారంగరుచులఁ
బైనఁ గొసరిడు గోస్తనీ ఫలరుచు లని.

రమణి నీ యెదలో పొంగారు ప్రేమరసామృతము మధురనారంగ ఫలరుచులపైన ద్రాక్షఫలముల కొసరునిస్తున్నట్లు కనబడుతుంది.

చికిలి చూపులలోన శృంగారరసవల్లి
　　పూలు పూయుచుఁ దోరణాలు గట్ట
చిలిపి లేనవ్వులఁ జెలువంపు వారాశి
　　నెలబాలు లేత వెన్నెలల నలుక
కలికి భ్రూనర్తన న్లలితలావణ్యాభ్ర
　　ములునింద్రధనువుల ముగ్గుదీర్చ
కులుకు గ్రీవాభంగముల సారె కొయ్యార
　　ములవాఁక కంబు: మంగళములీన

చికిలి చూపులలో శృంగార రసవల్లి నల్లకలువల తోరణాలుగట్టి శృంగారించగా చిలిపి చూపులలో సౌందర్యసముద్రము నెలబాలు వెన్నెలలనే సున్నాలు వేయగా మనోజ్ఞమైన భ్రూలతలలో లావణ్యా కాశాలు రంగారుసింగిణుల ముగ్గులు దీర్చగా కులుకుచున్న గ్రీవలో ఒయ్యారాల నది శంఖముల సృష్టించి మంగళములు చేకూర్చగా నాతికోకిల గొంతులోని స్వరాలు సన్నాయిబాడగా లజ్జయే వధూవరులమధ్య తెరపటమై వరలుచుండగా ప్రణయంతో కూడుకొని తెల్లని చూపులు శోభలు తలంబ్రాలు వోయగా ఆ భోగిని తాను నరపతియైన సింగభూపాలుని మనస్సు లగ్నమగునట్లు చేసింది. ఇందులో మొదటినుండి పెండ్లికి తగు శృంగార సంభారాలు కావింపబడినాయి. ఇందు సీసపాదాల్లో నిదర్శనాలంకారము ద్యోతకమౌతున్నది. గీత చరణాల్లో రూపకాలంకారము భాసిస్తున్నది. ఇట్లు మంగళాంతంగా ఆ భోగినికి నరపతికి పరస్పరం మనస్సులు లగ్నమైనట్లు వర్ణించబడింది.

మంగళం మహత్





# డా॥ వానమామలై వరదాచార్యుల
## జీవన రేఖలు

పుట్టిన తేది : 16 ఆగస్టు, 1912 (పరీధావి శ్రావణ బహుళ ఏకాదశి)

జన్మస్థలం : మడికొండ గ్రామం, వరంగల్ జిల్లా, ఆం.ప్ర.

నివాసస్థలం : చెన్నూరు, ఆదిలాబాదు జిల్లా, ఆం. ప్ర.

తల్లిదండ్రులు : శ్రీమతి సీతాంబ, శ్రీ బక్కయ్యశాస్త్రి

భార్య : శ్రీమతి వైదేహి

చదువు : ఆంధ్ర విశారద

ఉద్యోగం : ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ విద్యాశాఖలో ఉపాధ్యాయులుగా ఉద్యోగ విరమణ. అనంతరం ఆరేళ్లపాటు రాష్ట్ర విధానమండలి సభ్యులుగా నియామకం

**అచ్చయిన గ్రంథాలు :**

మణిమాల (పద్య, గేయకృతి), ఆహ్వానం (గేయసంపుటి), శ్రీ సత్యనారాయణ వ్రతకల్పము, పోతన చరిత్రము (మహాకావ్యం), జయధ్వజం (గేయసంపుటి), విప్రలబ్ధ (గేయ కథాకావ్యం), స్తోత్ర రత్నావళి (అనువాదకావ్యం), భోగినీలాస్యం (వ్యాఖ్యానం), గీత రామాయణం (అనువాద గేయకావ్యం), వైశాలిని (మహానాటకం), సూక్తి వైజయంతి (సుభాషితాలు), స్తవరాజపంచశతి (శతక సంపుటి), అభ్యుదయ నాటికా సంపుటి, రైతుబిడ్డ (బుఱ్ఱకథల సంపుటి), దాగురింతలు (పద్యకావ్యం), వ్యాసవాణి (వ్యాసాలు), కూలిపోయే కొమ్మ (వచన కథాకావ్యం)

**అముద్రిత రచనలు:**

మానవులంతా మనవాళ్లే (నవల), పాటలు, అలంకారశాస్త్రం, శాకీర్ గీతాలు (అనువాదం)

**బిరుదులు:**

అభినవపోతన, అభినవకాళిదాసు, ఆంధ్రకవితంస, మధురకవి, కవికోకిల, ఉత్ప్రేక్షా కవిచక్రవర్తి, మహాకవిశిరోమణి, కవిశిరోవతంస

**సన్మానాలు, సత్కారాలు:**

ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ అవార్డు; షష్టిపూర్తి సందర్భంగా భారతీ సాహిత్యసమితి, కోరుట్ల వారిచే గండపెండేరం, స్వర్ణకంకణ ప్రదానం, స్వర్ణాభిషేకం; సంపూర్ణానంద సంస్కృత విశ్వవిద్యాలయం, వారణాసి వారి విద్యావాచస్పతి (డి. లిట్) గౌరవ డాక్టరేట్ ప్రదానం. ఇంకా ఆంధ్రరాష్ట్రంలోనే కాక రాష్ట్రం వెలుపల కూడా అనేక సన్మానాలు, సత్కారాలు.

**తెలుగు సంతకం:** వానమామలై వరదాచార్యులు

**నిర్యాణం:** 31-10-1984 (రక్తాక్షి ఆశ్వయుజ శుద్ధ అష్టమి బుధవారం)

A Publication of Yuva Bharathi